# మీ బిడ్డ పురోభివృద్ధికి రాచ బాట

## పిల్లల బహుమతి పథకం

ఈ పథకం మూలంగా, మీ బిడ్డకు తనసొంత మొత్తం సమకూడుతుంది. ఈ మొత్తం మీ బిడ్డతోపాటు సురక్షితంగా పెరుగుతుంది. అబ్బాయికి 21వ ఏట (అమ్మాయికి 18వ ఏట) ఒక పెద్ద మొత్తం చేతికి దొరుకుతుంది. పైచదువుకు గాని, ఏదైనా వృత్తిని చేపట్టడానికి గాని, జీవితంలో స్థిరపడటానికి గాని, ఈ వయసులోనేగదా పెద్ద మొత్తం కావలసివచ్చేది! ఇంకా, మా లక్కీడ్రాతో మీ బిడ్డ పెద్దనగదు బహుమతులను పొందేందుకు అనేక అవకాశములుగలవు!



**యూనిట్ ట్రస్ట్ ఆఫ్ ఇండియా**

ఇంకా ఇతర సమాచారమునకు దయచేసి మా అతి దగ్గర ఆఫీసును సంప్రదించండి:

- 45, వీర్ నారిమన్ రోడ్, బొంబాయి 400 023
- 9, మేథ్యూ రోడ్, బొంబాయి 400 004
- 8, కౌన్సిల్ హౌస్ స్ట్రీట్, కలకత్తా 700 001
- 6, పార్లమెంట్ స్ట్రీట్, న్యూఢిల్లీ 110 001
- ఫోర్ట్ గ్లాసిస్, మద్రాస్ 600 001

**మీ పొదుపుకు మెట్లు యూనిట్లు.**



**CHILDREN'S GIFT PLAN**




Sista's-UTI-735/76-A-Tel




తెలీదే, అందంతో విలసిల్లే
అందాలబరిణవు నీవు, అయితే
నీవెవరో గుర్తే లేదు మరి నాకరి.


ఆ, మరిచ్చిన ఉంగరం... లేదు
అయ్యో, నే మరచిపోయాను
ఇంట్లో అయ్యయ్యో!


మనసున్న మా రాజా, చేప కడుపులో
చూశాం ఈ ఉంగరం మహారాజా!


ఆ! దీనికి
ఏం బహుమతి
కావాలో
కోరుకోండి మీరు.
కృతజ్ఞులం ప్రభూ..
కావాలి
పాపిన్స్ మాకు!


కల చెదరిపోగానే కనుగొన్నారు
వారు, పాపిన్స్‌తోపాటు
అమర్ చిత్ర కథలు ఆ చుట్టూ!


మిత్రుల్లారా, పై కాగితాలు కొద్దిగా
ఇస్తే చాలు, ఆసైన ఈ కామిక్
పుస్తకాలు మీకోసం వాలు






PARLE
POPPINS
MIXED FRUITY SWEETS

# చందమామ

సంస్థాపకుడు : 'చక్రపాణి'
సంచాలకుడు : నాగిరెడ్డి

ఈ నెల బేతాళకథ [''అంతరార్థం'']కు ఆధారం వీరేపల్లి జయరాంరెడ్డి రచన. నాగరిక సమాజం అనేక అంతస్తుల మేడలాటిది. ప్రతి అంతస్తులో ఉండే వాడికీ తన పై అంతస్తులో వాడి జీవితం ఆనందకరంగానూ, తన కింది అంతస్తులో వాడిది బాధాకరంగానూ ఉన్నట్టు కనిపిస్తుంది. అందులో అబద్ధం కూడా ఏమీలేదు. అయితే, ఒక్కొక్క అంతస్తే పైకి వెళ్ళిన కొద్దీ వ్యక్తుల విలువ పెరిగినా, వ్యక్తుల మధ్య ఆప్యాయతలు క్రమంగా క్షీణిస్తాయి. అందుచేత కొందరు పైకి వెళ్ళాలన్న ఆలోచనలనూ, అవకాశాన్నీ విడిచిపెడతారు.

సంపుటి 60 ఫిబ్రవరి '77 సంచిక 2

విడి ప్రతి : 1-25 : : సంవత్సర చందా : 15-00









త్యాజ్యం న ధైర్యం విదురేపి కాలే,
ధైర్యాత్ కదాచిత్ గతి మాప్నుయాత్ సః,
యథా సముద్రేపి చ పోతభంగే
సాం యాత్రికో వాంఛతి తర్తు మేవ. 1

[కష్టకాలంలో కూడా ధైర్యం విడువరాదు. ధైర్యం ఉంటే ఒకప్పుడు తప్పించుకునే మార్గం దొరకవచ్చు. సముద్రం మీద ఓడలు పగిలితే యాత్రికుడు తప్పించుకోవటానికే చూస్తాడు.]

వ్యసనే మిత్రపరీక్షా,
శూరపరీక్షా రణాంగనే భవతి,
వినయే భృత్యపరీక్షా,
దానపరీక్షా చ దుర్భిక్షే. 2

[కష్టకాలంలో మిత్రపరీక్షా, యుద్ధభూమిలో శూరపరీక్షా, వినయంలో సేవకుడిపరీక్షా, కరువులో దానపరీక్షా జరుగుతాయి.]

న సదశ్వాః కశాఘాతం,
న సింహా ఘనగర్జితం,
పరై రంగులినిర్దిష్టం
న సహంతే మనస్వినః. 3

[మంచి గుర్రాలు దెబ్బపడవు. సింహాలు మేఘగర్జన సహించవు., స్వాభిమానం గలవాడు మరొకడి చేత వేలెత్తి చూపించబడటం సహించడు.]



# మిత్రసంప్రాప్తి

## 44

సరస్సు తీరాన మిత్రులు నలుగురూ సుఖంగా కాలం వెళ్ళబుచ్చుతూండగా ఒకనాడు గోష్ఠిలో చిత్రాంగం (లేడి) హాజరుకాలేదు. మిగిలిన మిత్రులు ముగ్గురూ, ''ఏమైఉంటుంది? దాన్ని ఏ సింహం గాని చంపలేదు గద? అది ఏ వేటగాడి ఉచ్చులోనే చిక్కుకోలేదు గద? ఏ కార్చిచ్చు మధ్యనే చిక్కపోలేదు గద?'' అని విచారించారు.

చివరకు మంథరకం (తాబేలు) కాకితో, ''దాన్ని వెతుక్కుంటూ పోవటం నాకూ, ఎలుకకూ సాధ్యంకాదు. అందుచేత నువు అరణ్యం మీదుగా ఎగురుతూ వెళ్ళి, చిత్రాంగం బతికి ఉన్నదీ, లేనిదీ చూసిరా,'' అన్నది.

లఘుపతనకం (కాకి) అలాగే ఎగురుతూ వెళ్ళి, సరస్సుకు సమీపంలోనే, ఉచ్చులలో చిక్కి ఉన్న చిత్రాంగాన్ని చూసి, దుఃఖంతో, "మిత్రమా, ఏమిటిది?" అని అడిగింది.

మిత్రుడి దర్శనంతో లేడికి దుఃఖం ఆగలేదు. అది కాకితో, "నా కాలంతీరింది. ఈ ఆఖరుక్షణంలో మిత్రసందర్శనంకన్న కోరదగినది ఏముంటుంది? నేను ప్రసంగ వశాన నీతో పరుషాలాడి ఉంటే నన్ను క్షమించు. అదేవిధంగా నా తప్పులను క్షమించమన్నానని హిరణ్యకం (ఎలుక) తోనూ, మంథరకం (తాబేలు) తోనూ చెప్పు,'' అన్నది.

దానికి కాకి, ''మిత్రమా, మా లాటి మిత్రులు ఉండగా నిరాశచెందుతావు దేనికి? నేను ఇప్పుడే వెళ్ళి హిరణ్యకాన్ని తెస్తాను. అది నీ ఉచ్చు తాళ్ళను కొరికి, నిన్ను విడిపిస్తుంది,'' అన్నది.

అట్ట చివరి బొమ్మ



కాకి లేడిని ఇలా ఊరడించి, తాబేలూ, ఎలుకా ఉన్నచోటికి వెళ్ళి, లేడికి సంభవించిన దుస్థితి తెలిపి, హిరణ్యకాన్ని తన వీపు మీద ఎక్కించుకుని, చప్పున లేడి ఉన్నచోటికి వచ్చింది.

తన మిత్రులను చూడగానే లేడి, ''బుద్ధిమంతుడైన వాడు ఆపదలో సహాయం పొందాలంటే మీ లాటి మిత్రులను సంపాదించాలి,'' అన్నది.

ఎలుక లేడిని, "మిత్రమా, ఇంత వివేకం గల నువు ఉచ్చుల్లో ఎలా పడ్డావు?'' అని అడిగింది.

''నేను ఉచ్చులలో పడటం ఇది మొదటిసారి కాదు. అదివరకు ఒకసారి ఇలాగే చిక్కుపడి, చివరకు తప్పించుకున్నాను,'' అన్నది లేడి.

ఆ కథ చెప్పమని ఎలుక అడిగితే, ''ఇది కథలు చెప్పుకునే సమయం కాదు. వేటగాడు ఏ క్షణాన అయినా రావచ్చు. నా బంధాలు కొరుకు,'' అని లేడి అన్నది.

ఎలుక నవ్వి, ''నేను చెంత ఉండగా నీకు వేటగాడి భయంలేదు. నేను అంతో ఇంతో శాస్త్రార్థాలు తెలిసినదాన్ని. నువూ నాకు తీసిపోవు. అందుచేత అడిగాను,'' అన్నది.

''విధి తోసుకు వచ్చినప్పుడు తెలివితేటలు ఎందుకూ పనికిరావు. ఎంతెంత లావు గ్రంథాలు రాయగలవాళ్ళు కూడా తమ నుదిటిరాతలో ఒక్క అక్షరం తుడపలేరు,'' అంటూ లేడి తన పాత అనుభవం ఇలా చెప్పింది:

చాలాకాలం క్రితం, నేను ఆరునెలల పిల్లగా ఉండగా, మంద కన్న ముందుకు దౌడుతీసేదాన్ని. పెద్ద లేళ్ళు పరిగెత్తటంతో బాటు, అవాంతరాలు అడ్డొస్తే వాటి మీదిగా దూకగలిగేవి.

ఒకరోజు నేను మంద వెంట వెళుతూండగా మా దారికి అడ్డంగా ఎవరో వేటగాడు పన్నిన ఉచ్చు కనిపించింది. పెద్ద లేళ్ళు దాని మీదుగా దూకి వెళ్ళాయి. అయితే నాకు దూకటం రాదు. అందుచేత నేను

పరిగెత్తుకుంటూ వెళ్ళి, ఉచ్చులో చిక్కుకున్నాను.

వేటగాడు చాలా సంతోషించి నా కాళ్లు బంధించాడు. నేను వేటగాడికి దొరికి పోవటం చూసి, మిగిలిన లేళ్ళు పారిపోయాయి.

అయితే వేటగాడు నన్ను చంపక, నేను అందంగా ఉన్నాననీ, నన్ను చంపే కన్న ఎవరికన్నా పెంచుకోవటానికి ఇస్తే ఎక్కువ గిట్టుబాటుగా ఉంటుందనీ అనుకున్నాడు. వాడు నన్ను ఇంటికి తీసుకుపోయి, నన్ను శుభ్రంగా కడిగి, ఎంతో చక్కగా అలంకరించి, తీసుకుపోయి ఒక రాజుకు అమ్మాడు.

రాజు నన్ను చాలా బాగా చూశాడు. ఆడవాళ్ళు నన్ను తెగముద్దుచేసి, ఎంతగానో శ్రమపెట్టారు.

ఇంతలో వర్షాకాలం వచ్చింది. ఉరుములూ, మెరుపులూ, వాన చూడగానే నా మనసు అరణ్యం కోసమూ, నా వాళ్ళ కోసమూ పీకింది. "నా వాళ్ల వెంట ఎప్పుడు పోతాను? అరణ్యంలో పడి ఎప్పుడు పరిగెత్తుతాను?'' అని ఏడ్చాను.

నా మాటలకు ఆశ్చర్యపడి, నాకు దయ్యం పట్టిందని, రాజు భూతవైద్యులను పిలిపించాడు. వాళ్ళు నన్ను కర్రలతో కొట్టుతుంటే ఒక సాధువు వాళ్ళను మందలించి, ''ఎందుకు దాన్ని అలా హింస పెట్టుతున్నారు? అది చెయ్యగూడని పని ఏం చేసింది?'' అని అడిగాడు.

నేను అన్నమాటలను వాళ్లు ఆయనకు చెప్పారు.

''ఈ అభాగ్యపు లేడి తన స్వాతంత్ర్యం కోసమూ, తన పాత విహారస్థలాల కోసమూ పరితపించటం కన్న స్వాభావికం ఏముంటుంది? దాన్ని విడిచిపుచ్చండి.'' అని సాధువు చెప్పాడు.

రాజు నాకు శుభ్రంగా స్నానంచేయించి, దెబ్బలవల్ల కలిగిన నా గాయాలకు మందులు పూయించి, నాకు స్వేచ్ఛ ఇప్పించాడు.



# 182. తొలి క్రైస్తవ చక్రవర్తి

నీరో లాటి రోమన్ చక్రవర్తి క్రైస్తవులను సింహాలవాత వేస్తే, కాన్‌స్టాంటైన్ అనే రోమన్ చక్రవర్తి రోమ్ సామ్రాజ్యానికి క్రైస్తవమతం ఇప్పించాడు. ఈయన పూర్తి విగ్రహం మొదట రోమన్ ఫోరమ్‌లో ఉండేది. దాని తలా, ఇతర ఖండాలూ బొమ్మలో చూడవచ్చు.





# మాయాసరోవరం

## 14

[జలపాతం నుంచి ప్రాణాలతో బయటపడిన జయశీలుడూ, సిద్ధసాధకుడూ ఒక మరుగుజ్జు వాణ్ణి, ప్రాణులను తినే చెట్టు నుంచి కాపాడారు. ఆ సమయంలో అక్కడికి మరుగుజ్జుజాతి వాళ్ళ రాణి వచ్చింది. ఆమె తన శత్రువులను గురించి చెపుతున్నంతలో, కొండ మీది నుంచి ఒక భయంకర జంతువు, వాళ్ళ కేసి ఒక బండరాయిని విసిరింది. తరవాత—]

జయశీలుడూ, సిద్ధసాధకుడూ కొండ గుట్ట మీద వున్న భయంకర జంతువును గాక, దాని పక్కన నిలబడివున్న మనిషి కేసి ఆశ్చర్యపోతూ చూడసాగారు. జయశీలుడికి ఆ మనిషిని తానెక్కడో చూశానన్న అనుమానం బాధించసాగింది. అంతలో భయంకర జంతువు విసిరిన బండరాయి, వేగంగా వచ్చి, వాళ్ళు నిలబడివున్న చోటుకు ఇరవై, ముప్ఫై అడుగుల దూరంలో దభీమంటూ నేల మీద పడింది.

మరుగుజ్జు వాళ్ళంతా భయకంపితులై పోయి, తమ పోట్టేళ్ళవాహనాలను అదిలించి, కొంచెం దూరంగాపోయి నిలబడ్డారు. మరుగుజ్జు రాణి కూడా కొంచెం ఎడంగాపోయి, జయశీల, సిద్ధసాధకులతో, ''మహాకాయుల్లారా, ఆ భయంకర నరవానరం, దానిని మచ్చికచేసిన మహా



కాయుడూ పదీపన్నెండు రోజులుగా మమ్మల్ని నానాహింసా పెడుతున్నారు. అరణ్యంలోకి వేటకుపోయిన మా జాతి వాళ్ళు నలుగుర్ని, ఆ మహాకాయుడు చంపాడు కూడా. ఏ క్షణాన అయినా, మా శత్రుజాతివాళ్ళు, అతడి అసరాతో మా మీద దాడిచేయవచ్చు,'' అన్నది.

జయశీలుడికీ, సిద్ధసాధకుడికీ గడెకారి రాణి మీద చాలా జాలికలిగింది. ఆవిడా, ఆవిడ జాతివాళ్ళే అయిన మరుగుజ్జు మనుషులూ ధైర్యవంతులనీ, సాహసికులనీ తెలుస్తూనే వున్నది; కాని వాళ్ళు నరవానరాన్నీ, దాని వెంటవున్న మనిషినీ చూసి భయభ్రాంతులవుతున్నారు.

"జయశీలా, ఆ నరవానరం పక్కన కత్తి పట్టివున్న వాడెవడో మనరాజ్యంవాడు కాదుగదా? కొంచెం జాగ్రత్తగా చూడు!" అన్నాడు సిద్ధసాధకుడు.

జయశీలుడికూ్కడా, నరవానరం వెంట వున్నవాడు ఫలానా అయివుండ వచ్చున్న అనుమానం కలిగింది. కాని, వాడు తనలాగే యిన్ని అరణ్యాలూ, కొండలూ, నదులూ దాటి యిక్కడి కొచ్చే అవకాశం లేదు.....

జయశీలుడు యిలా ఆలోచిస్తున్నంతలో నరవానరం పక్కన వున్నవాడు, వానరాన్ని కత్తి పిడితో పొడిచి, ఏదో అజ్ఞ యిచ్చాడు. నరవానరం గెంతుతూ పోయి దాపులనున్న ఒక బండరాయిని పైకెత్తేందుకు ప్రయత్నిస్తున్నది. కాని, రాయి చాలా పెద్దదవటంతో, దానికి ఒక పట్టాన ఎత్తటం సాధ్యంకాక, గింజుకుంటూ అరుస్తున్నది.

"సాధకా, వాడు మళ్ళీ మన కేసి బండరాయిని నరవానరం చేత విసిరించాలని చూస్తున్నట్టున్నది. పట్టపగలు అంత పెద్ద రాయిదెబ్బ నుంచి తప్పుకోవటం చాలా సులువని, ఆ బుద్ధిహీనుడికి తెలిసినట్టు లేదు,'' అని, జయశీలుడు గడెకారి రాణితో, ''మీ వాళ్ళు అరణ్యంలో వేటాడేందుకు విలంబులను ఉపయోగిస్తారు

గదా ? అలాంటి ఒక విల్లంబు వెంటనే తెప్పించు.'' అన్నాడు.

గడెకారి మరుగుజ్జులు సర్వసాధారణంగా బళ్ళాలతోనే వేటాడతారు. అది వాళ్ళ జాతి కట్టడి. ఆ కారణం వల్లనే, వాళ్ళకు గడెకారి జాతి అన్న పేరు వచ్చింది. కాని, వాళ్ళ సేనానాయకుడికి చాలాకాలంక్రితం అరణ్యంలో ఒకచోట పెద్దవిల్లూ,అయిదారు అంబులూ దొరికినై. వాటిని అతడు భద్రంగా దాచివుంచాడు. ఆ సంగతి మరుగుజ్జురాణికి తెలియదు.

జయశీలుడు విల్లంబుల సంగతి తేగానే మరుగుజ్జు సేనాని భయంగా ఒకసారి రాణీకేసి చూసి, ఏదో చెప్పబోయి భయంతో గొంతు పెగలక వూరుకున్నాడు. అది గమనించిన సిద్ధసాధకుడు, అతడితో, ''ఏమోయ్, మరుగుజ్జు యోధుడా! మాట్లాడేందుకే భయపడే నువ్వు, యిక యుద్ధంలో సైనికుల్నీ, పొట్టేలు రౌతుల్నీ ఎలా నడిపించగలవు?'' అని అడిగాడు.

ఆ ప్రశ్నకు మరుగుజ్జుసేనాని వెలవెలపోతూ, రాణితో, ''మహరాణీ! మన జాతివాళ్ళు విల్లంబులు అంటరాదన్న నియమం వున్నది. కాని, నేను నియమభంగం చేసి, అరణ్యంలో దొరికిన విల్లంబులను, నా ఇంట దాచివుంచాను,'' అన్నాడు.



మరుగుజ్జురాణి ఆ మాటలు వింటూనే రౌద్రంతెచ్చుకుని ఏమో అనబోయేంతలో, జయశీలుడు చేయెత్తి, ఆమెను శాంతపరుస్తూ, ''రాణీ, నీ సేనాని చేసిన పని, మీ జాతివాళ్ల దృష్టిలో ఎంత గొప్పనేరమో నాకు తెలియదు. కాని, ఆ విల్లంబులను తక్షణం తెప్పించావంటే, ప్రస్తుతానికి ఆ నరవానరం పీడ వదిలిస్తాను. తరవాత నేనే, నా విల్లంబులు తయారుచేసుకుని, ఆ మనిషినీ, వానరాన్నీ ఎలా హతమార్చాలో పథకంవేయగలను,'' అన్నాడు.

మరుగుజ్జురాణి మారుమాట్టాడకుండా, తన సేనానాయకుడి కేసి చూసింది. మరుగుజ్జుసేనాని వెంటనే తన వాహనాన్ని



అదిలించి, వేగంగా చెట్ల వెనక వున్న తన ఇంటి కేసి వెళ్ళాడు.

ఈలోపల నరవానరం మరొక బండ రాయిని ఎత్తి పట్టుకున్నది. దాని నడుముకు కట్టిన ఇనుపగొలుసును పట్టుకున్న వాడు, పెద్ద గొంతుతో అరిచి, కత్తిపిడితో దాని వీపు మీద కొట్టాడు. నరవానరం గిరుక్కున పక్కకు తిరిగి బండరాయిని వాడి మీదికి విసరబోయింది. ఈసారి వాడు కత్తిమొనను వానరం గొంతుకు ఆనించి, బిగ్గరగా కేక పెట్టాడు.

నరవానరాన్ని మచ్చికచేసినవాడి కేక, కొండగుట్ట దిగువున వున్న జయశీలుడికీ, అతడి వెంట వున్నవాళ్ళందరికీ వినిపించింది. జయశీలుడు చిన్నగా ఈలవేసి, "సిద్ధసాధకా! ఆ మనిషి ఎవడో యిప్పుడు, నాకు తెలిసిపోయింది. వాడు, మీ హిరణ్యాపురంవాడు కాదు; మా అమరావతీనగరం వాడు. నేను పుట్టి పెరిగిన నగరం వదిలి, దేశాలుపట్టుకుని, మీ హిరణ్యపురం చేరటానికీ, అక్కడినుంచి యిలా అరణ్యాల వెంట తిరగటానికీ—వాడే కారకుడు. వాడొకప్పుడు మా రాజు రుద్రసేనుడి దగ్గిర అశ్వదళనాయకుడు. పేరు కృపాణజిత్తు!" అన్నాడు.

ఆ మాటలకు సిద్ధసాధకుడు ఎక్కడలేని ఆశ్చర్యం కనబరుస్తూ, "జయశీలా, యిది అద్భుతంకాదా! అమరావతీనగరం ఎక్కడ? ఈ మహారణ్యాలూ, యీ మరుగుజ్జుజాతి వాళ్ళూ ఎక్కడ? ఇంతకూ యిప్పుడు నువ్వేం చేయాలనుకుంటున్నావు?" అని అడిగాడు.

జయశీలుడు కొంచెంసేపు కొండగుట్ట కేసి చూస్తూ వూరుకుని, "సిద్ధసాధకా! తనను బాణంతో చావుదెబ్బ కొట్టినవాడెవడో తెలియకుండా కృపాణజిత్తు, యీ లోకాన్ని వదలటం నా కిష్టం లేదు. వాడు ఆ నరవానరంతో చేసిన పనే చేయిస్తున్నాడు. దానికి గురిగా బండరాళ్లు వదిలేపాటి శక్తి కూడా వున్నట్టు లేదు. పైగా, కోపం కొద్దీ అది తనను మచ్చిక

చేసినవాణ్ణే రాయితో కొట్టబోతున్నది,'' అన్నాడు.

జయశీలుడు యిలా మాట్లాడుతున్నంతలో, విల్లంబులు తెచ్చేందుకు పోయిన మరుగుజ్జుసేనాని, అక్కడికి తిరిగివచ్చి, పొట్టేలువాహనం దిగి, తాను తెచ్చినవాటిని జయశీలుడి పాదాలముందు పెట్టాడు. జయశీలుడు విల్లును పరీకించి చూశాడు; అది చాలా దృఢంగా వున్నది. దానితోపాటు అరు వాడిగల బాణాలు!

సిద్ధసాధకుడు ఆ విల్లంబుల కేసి చూసి, "జయశీలా! నీ శత్రువు ఆ కృపాణజిత్తునూ, నరవానరాన్నీ అస్త్రం దెబ్బలతో పరలోకానికి పంపబోతున్నావా?'' అని అడిగాడు.

ఆ ప్రశ్నకు జయశీలుడు నవ్వి, "సాధకా, ఇంతదూరాన్నుంచి ఆ యిద్దర్నీ బాణంతో గురిగా కొట్టటం అంత తేలిక అనుకుంటున్నావా? ఇవి షూమూలు బాణాలు; బ్రహ్మాస్త్రాలో, నాగాస్త్రాలో కాదు,'' అన్నాడు.

ఈ లోపల కొండగుట్ట మీద చిన్న కల్లోలం లేచింది. రెచ్చిపోయిన నరవానరం, తనను మచ్చికచేసినవాడి మీద ఎదురుతిరిగి, బండరాయితో వాణ్ణి కొట్టాలని చూడటం, వాడు కత్తిమొనతో దాన్ని మెల్లిగా పొడుస్తూ, అటూ యిటూ గెంతుతూండటం ప్రారంభమైంది. అంతలో అక్కడికి నలుగురైదుగురు మరుగుజ్జువాళ్ళు తాళ్ళతో వచ్చి, కొంచెం దూరాన





వుంది, తాళ్ళు విసిరి నరవానరం కాళ్లనూ, చేతులనూ బంధించారు. కాని, నరవానరం రాయి కింద పడవేసి యింకా పెనుగులాడుతూనే వున్నది.

మరుగుజ్జుసేనాని అది చూసి ఉత్సాహంగా జయశీలుడితో, "అయ్యా, ఆ భయంకర జంతువును చంపటానికి యిదే మంచి సమయం. బాణం వదలండి," అన్నాడు.

మరుగుజ్జురాణి కూడా అవునన్నట్టు తలవూపి, '' వెంటవున్న మనిషిని చూసి కాక, ఆ నరవానరాన్ని చూసే మేం ఎక్కువ భయపడుతున్నాం. దాని అడ్డు తొలగించారంటే, జాత్యహంకారంతో మమ్మల్ని నాశనం చేయాలని చూస్తున్న గడెకొండ దుష్టుణ్ణి, వాడి అనుచరులనూ, ఒకటి రెండు రోజుల్లో హతమార్చగలం," అన్నది.

జయశీలుడికి మాత్రం ఇంతదూరాన్నుంచి, కొండగుట్ట మీద వున్న వాళ్ళను బాణంతో గురిగా కొట్టటం సాధ్యంగా కనిపించలేదు. అయినా శత్రువులకు భయంతోపాటు, తాను ఆ ప్రాంతానికి వచ్చానన్న సంగతి కృపాణజిత్తుకు తెలపటం, యుద్ధ ధర్మం అనిపించుకుంటుందని అతడు కొంత ముందుకు పోయి, అక్కడవున్న ఒక ఎత్తయిన రాయి మీద నిలబడి కత్తిదూసి పైకెత్తి పట్టుకుని, '' నీచుడా కృపాణజిత్తూ ! ఇదుగో, నేను జయశీలుణ్ణి—వచ్చాను.'' అంటూ పెద్దగా కేక పెట్టాడు.

ఆ కేకను కొండగుట్ట మీదవున్న వాళ్లు వినిపించుకున్నట్టులేదు. కృపాణజిత్తుతో పాటు, మిగతా మరుగుజ్జువాళ్ళు, నరవానరాన్ని అదుపులోకి తెచ్చుకునేందుకు నానా అవస్థాపడుతున్నారు. కృపాణజిత్తు, వానరం నడుముకు బిగించిన ఇనుప గొలుసును బలంగా పట్టుకుని వెనక్కులాగుతూంటే, మరుగుజ్జు వాళ్ళు, దాని కాళ్ళకూ, చేతులకూ తగిలించిన తాళ్లను ముందుకులాగుతున్నారు. వానరం భయంకరంగా అరుస్తూ, విడిపించుకునేందుకు పెనుగులాడుతున్నది.

కత్తి ఎత్తి నిలబడివున్న జయశీలుడి దగ్గిరకు సిద్ధసాధకుడూ, మరుగుజ్జు రాణీ వచ్చారు. సిద్ధసాధకుడు, జయశీలుణ్ణి, ''జయశీలా! రాణీ, ఆమె సైనికులు కూడా తమ శత్రువులను హతమార్చేందుకు యిదే మంచి అదనుగా భావిస్తున్నారు. నరవానరాన్ని తాళ్ళతో కట్టి లాగుతున్న వాళ్ళలో రాణీకి ముఖ్య శత్రులైన గడెకొండ అనేవాడు కూడా వున్నాడట! అక్కడి మరుగుజ్జువాళ్ళలో తల మీద రాబందు ఈకలు కట్టుకున్న వాడు కనిపిస్తున్నాడా?'' అని అడిగాడు.

జయశీలుడు యీసారి కొండగుట్ట మీది వాళ్ళల్లో ప్రతి ఒక్కణ్ణీ పరీక్షగా చూశాడు. వాళ్ళల్లో సిద్ధసాధకుడు చెప్పిన గుర్తులుగల వాడున్నాడు. వాడు గడెకొండ దన్నమాట! వాడు రాణీకి శత్రువేమోగాని, యీ క్షణంవరకూ తనకు మాత్రం శత్రువు కాదు. తన శత్రువు కృపాణజిత్తు! తను కొట్టదలిస్తే, బాణంతో వాణ్ణే కొట్టాలి....

ఇలా ఆలోచిస్తూ, జయశీలుడు విల్లంబు పైకెత్తి తల తిప్పి చూశాడు. దాపుల్లో చాలా మంది పొట్టేలు రౌతులూ, వాళ్ళ వెనగ్గా బళ్ళాలు చేతబట్టిన మరుగుజ్జు సైనికులూ, కొండగుట్ట ఎక్కేందుకు సిద్ధంగా నిలబడి వున్నారు.

జయశీలుడు, మరుగుజ్జురాణీ కేసి చూసి, ''రాణీ, మీ వాళ్ళంతా యుద్ధ సన్నద్ధులైనట్టుందే! ఒక్క బాణం దెబ్బతో నేను నరవానరాన్నీ, నువ్వనే మహా



కాయుడైన మనిషినీ చంపలేను గదా? నా బాణం వచ్చిపడగానే, నీ శత్రువులు తగు జాగ్రత్తలో వుంటారు. వాళ్ళతో యుద్ధానికి యిది మంచి సమయం అవునో కాదో ఆలోచించు,'' అన్నాడు.

మరుగుజ్జురాణి, నీ అభిప్రాయం ఏమిటన్నట్టు తన సేనాని కేసి చూసింది. మరుగుజ్జుసేనాని తన వాహనం మీద ధీమాగా బళ్ళెం ఎత్తి పట్టుకుని జయశీలుడితో, ''అయ్యా, మీరు ఆ దుర్మార్గుల కేసి బాణం కొట్టండి, చాలు! ఇంత వరకూ మా శత్రువులు, బళ్ళెంపోటు ఎలాంటిదో తప్ప, బాణం దెబ్బ ఎరగరు. మీ బాణంపోయి తగలగానే వాళ్ళు భయకంపితులైపోతారు. అది అవకాశంగా తీసుకుని మేము దాడిచేసి, వాళ్ళను ఆ కొండగుట్ట అవతలికి తరిమి కొడతాము. సాధ్యమైతే వాళ్ళుండే గూడెంమీద పడి, దానికి నిప్పు పెడతాము,'' అన్నాడు.

''సరే, సేనానీ! నీ కున్న ఉత్సాహంలో కత్తి పట్టిన మనిషినీ, నరవానరాన్నీ కూడా మరిచిపోతున్నావు. అయినా, నీ శక్తి, నీ తోటి సైనికుల శక్తి ఎలాంటిదో చూడాలనివుంది,'' అన్నాడు జయశీలుడు.

ఆ వెంటనే సిద్ధసాధకుడు శూలంఎత్తి, ''జయశీలా! యిదే మంచి సమయం, బాణం వదులు. నరవానరం కట్టుతాళ్ళు తెంచుకుని, ఒక మరుగుజ్జువాణ్ణి పట్టుకున్నది.'' అంటూ కేకపెట్టాడు.

జయశీలుడు బాణం ఎక్కుపెట్టి, నరవానరం కేసి వదిలాడు. బాణం రివ్వుమంటూపోయి వానరం నడుముకు తగిలింది. మరుక్షణం అది భీకరంగా అరిచి, తన చేతికి దొరికిన మరుగుజ్జువాణ్ణి, కొండగుట్ట కిందికి విసిరివేసింది.

మరుగుజ్జువాడు ప్రాణభయంతో కీచుమంటూ గాలిలో కొట్టుకుని వస్తుండగా, మరుగుజ్జు సేనానాయకుడు తన అనుచరులను హెచ్చరించాడు. గొర్రెపొట్టేలు రౌతులూ, కాలిభటులూ కేకలువేస్తూ, బళ్ళాలు ఎత్తి పట్టుకుని కొండగుట్ట మీదికి పరిగెత్తసాగారు. —(ఇంకావుంది.)





# అంతరార్థం

పట్టువదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగివెళ్ళి, చెట్టుపై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, ''రాజా, ప్రాజ్ఞుడవైన నీ లాంటి వాడు పరిస్థితులకు బానిస అయిపోవటం ఆశ్చర్యం. అనాగరికుడు తనకు లభించిన అద్భుతమైన అవకాశాలను కూడా వినియోగించుకోలేకపోతాడు. అందుకు నిదర్శనంగా నీకు వీరుడు అనే ఆటవికుడి కథ చెబుతాను, శ్రమ తెలియకుండా విను,'' అంటూ ఇలా చెప్పసాగాడు:

పూర్వం కామరూపదేశాన్ని మలయసేనుడు పాలిరించాడు. ఆయనకు సంతానం కలగలేదు. వృద్ధాప్యం కూడా వచ్చేస్తున్నది. ఆయనకు వారసులు లేని కారణంచేత, రాజ్యాన్ని చేజిక్కించుకోవా

## బేతాళ కథలు



లని చాలామంది ప్రయత్నించారు. ఆయన మీద ఎన్నో హత్యాప్రయత్నాలు జరిగాయి. కాని దైవికంగా అవి ఏవీ ఫలించలేదు. ఆ ప్రయత్నాలు ఎవరు చేస్తున్నదీ తెలుసుకోవటం కూడా మలయసేనుడికి సాధ్యం కాలేదు.

ఇలా ఉండగా, తూర్పువైపు అరణ్యాలలో ఒక తెల్లపులి చేరి ప్రయాణీకులను చంపుతున్నట్టు మలయసేనుడికి తెలిసింది. ఆయన దాన్ని వేటాడటానికి బయలుదేరాడు. అడవిలోకి ఎంతదూరం వెళ్ళినా పులిజాడ ఏరూపంలోనూ కనిపించలేదు. కాని రాజు వెంట ఉన్న ఇద్దరు అంగరక్షకులూ ఒకేసారి కత్తులుదూసి, రాజు మీద విరుచుకుపడ్డారు. రాజు తాను కూడా కత్తిదూసి వారితో హోరాహోరి యుద్ధంచేశాడు. అయితే వయసుమళ్ళిన మలయసేనుడు ఇద్దరితో ఒకేసారి యుద్ధం చెయ్యటం సాధ్యంకాలేదు.

రాజు తన అంగరక్షకుల చేతిలో చావక తప్పని పరిస్థితిలో ఎక్కడినుంచో ఒక ఆటవిక యువకుడు వచ్చి, తన ఈటెతో ఒకణ్ణి చంపి, రెండోవాణ్ణి రాజుతో కలిసి చంపేసి, రాజు ప్రాణం కాపాడాడు.

ఆ యువకుడు ఆటవిక నాయకుడి కొడుకు. అతని పేరు వీరుడు. వీరుడి తండ్రి బందిపోటు నాయకుడు. వీరుడు రాజభక్తితో మలయసేనుణ్ణి రక్షించలేదు; ఇద్దరు వయసులో ఉన్నవాళ్ళు, ఒక వయసుమళ్ళినవాణ్ణి చంపయత్నిస్తుంటే అతనికి కోపం వచ్చింది. ఈ సంగతి మలయసేనుడు ఎరగడు. ఆయన వీరుడికి తన కృతజ్ఞత చెప్పుకుని, అతన్ని తన వెంట తన రాజధానికి రమ్మన్నాడు. రాజధాని ఎలా ఉంటుందో చూతామని వీరుడు ఒప్పుకున్నాడు.

రాజభవనం చేరుకున్నాక మలయసేనుడు వీరుడితో, తన మీద అనేక హత్యాప్రయత్నాలు జరిగాయనీ, వాటిని చేయిస్తున్నది ఎవరో తనకు అంతుబట్టలేదనీ చెప్పాడు. తరవాత ఆయన

వీరుడితో సహ భోజనానికి కూర్చున్నాడు. రెండుముద్దలు నోట పెట్టుకున్నాడో, లేదో, రాజు పడిపోయాడు. ఆయన భోజనంలో ఎవరో విషం పెట్టారు!



వెంటనే రాజవైద్యుడికి కబురువెళ్ళింది. ప్రధానమంత్రి వచ్చాడు. వైద్యుడు చేసిన విరుగుళ్ళు ఏవీ పనిచెయ్యలేదు. మలయ సేనుడు తన ప్రధానమంత్రితో వీరుడే తనకు వారసుడనీ, అతనికి రాజ్యాభిషేకం చెయ్యమనీ చెప్పి, ప్రాణాలు వదిలాడు.

ఘడియల మీద జరిగిన ఈ పరిణామాలు చూసి వీరుడు అయోమయంలో పడిపోయాడు. అతనికి తక్షణమే అక్కడి నుంచి వెళ్ళిపోవాలనిపించింది గాని, రాజుకు విషం పెట్టినదెవరో తెలుసుకోకుండా పోబుద్ధికాలేదు.

రాజుకాగానే వీరుడి మీద కూడా హత్యాప్రయత్నాలు జరిగాయి. అయితే అదృష్టవశాన అతను వాటిని తప్పుకుంటూ వచ్చాడు.

ఇదేసమయంలో రాజ్యంలో బందిపోటు దాడులు హెచ్చాయి. వాళ్ళు తనవాళ్ళేనని వీరుడికి తెలుసు. అందుచేత బందిపోటు వార్తలను అతను అంతగా పట్టించుకోలేదు.

ఇంతలో ఒకనాడు సేనాధిపతి వీరుడి వద్దకు వచ్చి, "మహారాజా, బందిపోటు నాయకుడు పట్టుబడ్డాడు. తమ సెలవైతే వాడికి మరణదండన విధించగలను," అన్నాడు.

తాను వచ్చాక తన ముఠానాయకుడెవరో చూడాలని, వీరుడు సేనాధిపతి వెంట చెరసాలకు వెళ్ళాడు. పట్టుబడిన వాడు వీరుడి కుడి భుజంలాటి వాడు. వీరుణ్ణి చూడగానే వాడి కళ్ళు ఆనందంతోనూ, ఆశతోనూ మెరిశాయి. వాడు ఏదో అనబోయినట్టు నోరు తెరిచి, మళ్ళీ మూసుకున్నాడు. వీరుడు చప్పున వెనక్కు తిరిగి అక్కడి నుంచి వచ్చేశాడు.

తన అనుచరుణ్ణి చెరసాలలో చూసినాక వీరుడి మనసు కల్లోల మయింది. అతను రాత్రి చాలా పొద్దుపోయినదాకా

మేలుకుని, చెరసాలకు వెళ్ళి, తన అనుచరుణ్ణి చెరవిడిపించి, అతడితో సహ అరణ్యాలలోకి వెళ్ళిపోయాడు.

బేతాళుడు ఈ కథ చెప్పి, "రాజా, వీరుడు తన రాజ్యాధికారాన్ని ఎందుకు వదులుకున్నాడు? హత్యాప్రయత్నాలకు భయపడా? లేక తనలో రాజ్యార్హత లేదని గ్రహించాడా? హత్యాప్రయత్నాలు చేస్తున్నది ఎవరో తెలుసుకోవాలనుకున్నవాడు ఆ ప్రయత్నం నుంచి ఎందుకు విరమించాడు? తన అనుచరుణ్ణి చెరసాలలో చూసి అతను ఎందుకు కలవరపడాలి? రాజుగా వాణ్ణి చెరవిడిపించే అధికారం తనకున్నది గదా? దాన్ని తాను ఉపయోగించుకున్నాడు కూడా గద? ఈ సందేహాలకు సమాధానాలు తెలిసి కూడా చెప్పకపోయావో నీ తల పగిలిపోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "వీరుడికి హత్యాప్రయత్నాల భయం ఉన్నట్టు కనిపించదు. అలాటిది ఉంటే తన మీద మొదటి హత్యాప్రయత్నం జరిగినప్పుడే పారిపోయి ఉండును. అయితే అతనిలో పరివర్తన రావటానికి ఒకే ఒక కారణం అతని అనుచరుడు చెరసాలలో కనబడటం. వాణ్ణి చెరసాలలో పెట్టించిన సంస్కారానికి మూల పురుషుడు తను అయినాడు! సేనాధిపతి పట్టుకున్నవాణ్ణి తాను విడిపించగలడే గాని, ఆ తరవాత తాను రాజుగా ఉండలేడు. తాను కూడా బందిపోటు దొంగేనని అందరికీ తెలిసిపోతుంది. హత్యాప్రయత్నాలకు గురి అయే రాజరికం మీద అసహ్యం పుట్టినాక వీరుడికి ఆ ప్రయత్నాలు ఎవరు చేస్తున్నారన్న సమస్య మీద ఏమీ ఆసక్తి ఉండక పోవటం సహజం. అందుచేత వీరుడు ఆత్మీయతలు లేని సంస్కారాన్ని వదిలేసి, ఆత్మీయతలే ప్రధానంగా గల అటవిక జీవితానికి తిరిగి వెళ్ళాడు," అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగగానే బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. —(కల్పితం)






అప్పుడే తెల్లవారింది. మురారి నిద్ర లేచి మామిడిచెట్టు కింద ముఖం కడుక్కుంటూండగా, త్రిలోచనుడు అనే వయసు మళ్ళిన గ్రామస్థుడు ఆదరా బాదరా వచ్చి, ఆయాసపడుతూ మురారికి ఎదురుగా నిలబడ్డాడు.

"ఏం జరిగింది, బాబాయ్, అంత ఆదుర్దాగా వచ్చావు?" అని మురారి అడిగాడు.

త్రిలోచనుడు కూర్చుని నుదురు అరిచేత్తో కొట్టుకుంటూ, "కొంప కూలింది!" అన్నాడు.

"దొంగతనమా? నిన్నెవరన్నా దోచారా?" అని మురారి ఆశ్చర్యపోతూ అడిగాడు.

"దోపిడీయే, కాని దోచినవాడు మన పొరుగు పెద్దమనిషి కిశోరీఠాకుర్," అన్నాడు త్రిలోచనుడు.

"ఏం జరిగింది? సరిగా చెప్పు." అని మురారి అడిగాడు.

"కిందటేడు కిశోరీ దగ్గిర రెండు వందలు అప్పుచేశా. రసీదు మీద నా చేత వేలిముద్ర వేయించుకున్నాడు. చదువు రాదుగా? అందులో ఏం రాసి ఉన్నదీ నేనెరగను. రెండు వందల రూపాయల భాగ్యానికి నేను ఎకరం పొలం తాకట్టు పెట్టానుట! అది స్వాధీనం చేసుకుంటా నంటూ ఇద్దరు మనుషులతో నిన్న మధ్యాన్నం దాటి వచ్చాడు. సాక్షి సంతకాలున్నాయి; తనవాళ్ళవే!" అన్నాడు త్రిలోచనుడు.

"విచారించకు, బాబాయ్. కోర్టులో అతని కేసు నిలవదు. కాకపోతే నీకు కొంత శరీరాయాసమూ, కాలయాపనా తప్పదు. ఒక్క కిశోరీఠాకూర్ మాత్రమే కాదు, గ్రామస్థులకు చదువు సంధ్యలు

ఏ. సి. సర్కార్, ఐంద్రజాలికుడు

రాకపోవటంచేత ఇంకా చాలామంది వాళ్ళను మోసగించి, పీడిస్తున్నారు. నీ సంగతి నేను చూసుకుంటాలే,'' అని మురారి త్రిలోచనుణ్ణి పంపేశాడు.

మురారి కొత్తగా 'లా' పాసయి, సమీపంలో ఉన్న బస్తీలో ప్రాక్టీసు చేసుకుంటూ, వారాంతంలో తన స్వగ్రామమైన కమల్‌పూర్ వచ్చి, తన తల్లిదండ్రులతో గడిపేవాడు. కమల్‌పూర్ గ్రామంలో అధికసంఖ్యాకులు రైతులూ, వృత్తిపనులు చేసుకునే వాళ్ళూనూ. వాళ్ళకు చదువు రాదు. విద్యావ్యాప్తి అంటే యువతరం వాళ్ళకు ఇష్టమే గాని వయోజనులైన స్త్రీపురుషులు చాలావరకు చదువురాని వారే.

చదువురాని కారణంచేత తమ గ్రామంలో వాళ్ళు ఎలా అధోగతిలో ఉన్నదీ మురారికి తెలుసు. అతను వయోజన విద్యాకేంద్రం ప్రారంభించటానికి ప్రయత్నం చేస్తే ఎవరూ ఎలాటి ఆసక్తీ చూపలేదు.

''సరస్వతీదేవి మమ్మల్ని కటాక్షించి ఉంటే చిన్నతనంలోనే చదువు అబ్బేది. జీవితం అయిపోవస్తూంటే ఇప్పుడింక చదివి ఏం లాభం?'' అన్నారు గ్రామంలోని వయోజనులు. మురారి ఏమీ చెయ్యలేక పోయాడు.

కాని, ఇప్పుడు త్రిలోచనుడి అనుభవం చూశాక మురారిలో పట్టుదల హెచ్చింది. చిన్నవాడయేది, ముసలివాడయేది,



గ్రామంలో నిరక్షరుడంటూ ఒక్కడు కూడా ఉండరాదని అతను తీర్మానించుకున్నాడు. అతను తన కార్యక్రమం కొనసాగించటానికి తన భార్యను సూమితను గ్రామంలోనే ఉంచేసి, గ్రామంలో పెద్దలందరి తోనూ మాట్లాడి చూశాడు. ఎవరిని కదిలించినా ఒకటే పాట: సరస్వతీదేవి గ్రామస్థులను అనుగ్రహించలేదు! వాళ్ళతో ఎంతగా వాదించీ లాభం లేదు. వాళ్ళవి చాలా పురాతనమైన మూఢ విశ్వాసాలు. వాళ్లు అద్భుతాలను మాత్రమే నమ్ముతారు.

అద్భుతం ద్వారానే గ్రామస్థుల వైఖరి మార్చటానికి మురారి పథకం ఆలోచించాడు. అందుకుగాను అతను సూమిత బంధువైన ఒక ఇంద్రజాలికుడి సలహా తీసుకున్నాడు.

మురారి అనేకవందల కాగితంముక్కల మీదా ఈక కలాన్ని తాజా నిమ్మరసంలో ముంచి "ఔను" అని స్పష్టంగా రాసి, ఆ కాగితం ముక్కలను ఎండ బెట్టాడు. వాటితో గ్రామస్థులకు అద్భుతం చేసి చూపాలి.

కమల్‌పూర్ గ్రామం పక్కగా ఒక చిన్న ఏరు పారుతూంటుంది. అది సరస్వతీ నదీపాయ అనీ, ఎంతో పవిత్రమైనదనీ గ్రామస్థులు నమ్ముతారు. వారి ఈ విశ్వాసం మురారికి పనికి వచ్చింది.

అతను ఊరి పెద్దలందరినీ పిలిచి, "సరస్వతీదేవి మీకు చదువు రాకూడ



దని నిర్ణయించినట్టు మీరు ఎప్పుడూ అంటూంటారు? ఆమె మీకు కనిపించి, అలా అని చెప్పిందా? లేదు. అలా ఎన్నడూ జరగలేదు. అది కేవలమూ మీ నమ్మకం మాత్రమే. అర్థంలేని నమ్మకం అంటాను. విద్యలకు అది దేవత అయి ఉండి, అలా ఒక్కనాటికి అనదు. చిన్నా, పెద్దా, పేదా, సాదా, ప్రతి ఒకరూ తన అనుగ్రహం పొందాలనీ, చదువుకోవాలనీ ఆమె కోరుతుంది. ఇవిగో, తెల్లకాగితం ముక్కలు. వాటిమీద ఏమీ రాసిలేదు. ఒక్కొక్కరూ ఒక్కొక్క కాగితం ముక్క తీసుకుని, పవిత్రమైన నదీజలంలో దాన్ని ముంచి దేవి మిమ్మల్ని చదువుకోమంటుందో, లేదో అడగండి. ఆమె తన అభిప్రాయాన్ని కాగితం మీద రాస్తుంది,'' అన్నాడు.

మురారి ఆలోచనను గ్రామస్థులు ఆమోదించినట్టే కనబడ్డారు. వయోజనులైన స్త్రీలూ, పురుషులూ తలా ఒక కాగితం ముక్కా తీసుకుని, మురారి వెంట నది దగ్గిరికి వెళ్ళి, ఒకరి తరవాత ఒకరుగా కాగితం ముక్కను నీటిలో ముంచి, తాము చదువుకోవాలన్నది సరస్వతీదేవి కోరికా అని అడిగారు. కొద్ది సేపట్లో కాగితం ముక్కల మీద ''ఔను'' అన్నమాట కనబడింది.

అందుచేత మురారి వయోజన విద్యా కార్యక్రమం ప్రారంభిస్తే ఎవరూ వద్దనటానికి సాహసించలేక పోయారు. వారు విద్యావంతులు కావాలని సరస్వతీదేవే కోరింది గద!

వయోజనులకు చదువు చెప్పే భారం సూమిత మీద పడింది. వారాంతంలో మురారి వచ్చి ఆమెకు సహాయం చేసేవాడు. క్రమంగా అతను బస్తీలో ఉండే సంఘసేవాసంస్థ సహకారాన్ని కూడా పొందాడు. ఒక్క ఏడాదిలో అతని ఉద్యమం విజయవంతమయింది. ఇప్పుడు కమల్‌పూరులో ఒక్క నిరక్షరుడు కూడా లేదు. దాన్ని అందరూ సరస్వతీపూర్ అంటున్నారు.





# మనిషి - డబ్బూ

ఒక ఊళ్ళో శ్రీమంతుడు అనే గుణవంతుడు ఉండేవాడు. అతను చాలా బీదవాడు. పై పెచ్చు తల్లిదండ్రులను పోగొట్టుకుని, చిన్న తనంలోనే దిక్కు లేనివాడు కూడా అయాడు. అప్పుడు అతన్ని అతని మేనమామ చేరదీసి, తన ఇంట కట్టు బాట్లతో పెంచాడు. అతని మేనమామ భార్య అదిలోనే అతని చదువు మాన్పించి, ఇంటిపనికి పెట్టింది.

శ్రీమంతుడి మేనమామకు సుందరి అనే కూతురు ఉండేది. శ్రీమంతుడూ, సుందరీ ఈడూ జోడుగా ఉండటం చూసి, ఇద్దరూ భార్యాభర్తలు కావాలని నలుగురూ అనేవారు. శ్రీమంతుడికి ఏ మాత్రం బాధ కలిగినా సుందరి జాలిపడినట్టు కనబడేది. ఆమెకు తన పై అపాటి ప్రేమ ఉన్నందుకు శ్రీమంతుడు ఉబ్బి, తబ్బిబ్బయేవాడు.

సుందరికి యుక్తవయసు వచ్చినాక శ్రీమంతుడితో చనువు తగ్గిపోయింది. ఆమెలో ఈమార్పు చూసి శ్రీమంతుడు ఏమంత కలవరపడలేదు: సుందరి తన తల్లికి భయపడి పెడపెడగా ఉంటున్నదనీ, ఆమెకు తన మీద ప్రేమ తగ్గలేదనీ గ్రహించాడు. అతనికైతే సుందరి మీద ప్రేమ చాలా ఎక్కువ అయింది.

ఒకసారి సుందరి ఒంటరి పాటున ఉండటం చూసి, వెనకనుంచి శ్రీమంతుడు చప్పుడు కాకుండా వెళ్ళి ఆమె కళ్ళు మూశాడు. వంటగది నుంచి వస్తున్న సుందరి తల్లి ఇది చూసి, ఉవ్వెత్తున లేచింది. ఆమె పెరట్లో ఉన్న తన భర్తను పిలిచి, "వయసులో ఉన్న పిల్లతో సరసాలా? రేపు దాని పెళ్ళి ఎలా అవుతుంది?" అంటూ శ్రీమంతుణ్ణి నానా మాటలూ అన్నది.

బూర్లె నాగేశ్వరరావు



''అదేమిటి, అత్తయ్యా? దాన్ని మరెవరో పెళ్ళి చేసుకోవటమేమిటి, నే నుండగా?'' అన్నాడు శ్రీమంతుడు వింతగా చూస్తూ.

''లేవు మరి; తిన్నది వంట బట్టి నిక్షేపంలా ఉన్నావు! ఈసారి పిల్లను తాకి చూడు, చేతులు విరగ్గొట్టి, బయటికి గెంటిస్తాను,'' అంటూ సుందరిని తీసుకుని తల్లి లోనికి వెళ్ళింది.

''అంతేనా, మామయ్యా?'' అన్నాడు శ్రీమంతుడు తన మేనమామ కేసి తిరిగి.

''ఒరేయ్, సుందరి ఊసు ఎత్తావంటే మక్కెలు విరుగుతాయి. తను దూరకంత లేదు, మెడ కొక డోలు అన్నట్టుంది, నీ వరస. నీకు గతిలేకనే గదా నా యింట్లో ఉంటున్నావు? నిన్ను పెళ్ళి చేసుకుంటే దానికి ఏం పెడతావురా?'' అన్నాడు మేనమామ.

శ్రీమంతుడు తన మేనమామకు ఎన్నో విధాల చెప్పి చూశాడు; మనిషికి మంచి తనం ప్రధానంగాని, డబ్బు కాదన్నాడు; సుందరిని తాను ప్రేమిస్తున్నా నన్నాడు.

''ప్రేమతో ఇల్లూ, వాకిలీ, తిండీ వస్తుందిట రా? మంచి తనం గుక్కెడు గంజి కూడా పొయ్యదు. ఈ మిట్ట వేదాంతం నా దగ్గిర చెప్పకు. డబ్బు తరవాతే ఇవన్నీనూ,'' అన్నాడు మామ.

శ్రీమంతుడికి పౌరుషం వచ్చి, ''సరే మామయ్యా! నా రక్తం ధారపోసి అయినా సరే డబ్బు సంపాదించి, సుందరిని దక్కించుకుంటాను. డబ్బు సంపాదించ లేకపోతే నా ముఖం మీకు చూపించను. ఒక్క ఏడాది వ్యవధి ఇయ్యి. ఈలోగా సుందరికి పెళ్ళి మాత్రం తలపెట్టకు,'' అన్నాడు, శలవు పుచ్చుకుంటూ.

''నువు లక్షలు సంపాదించటమూ, నా కూతుర్ని నీకిచ్చి పెళ్ళి చెయ్యడమూ —రెండూ జరిగేవేలే!'' అనుకున్నాడు మామ వెటకారంగా.

ఇల్లు విడిచి వెళ్ళినాక శ్రీమంతుడికి డబ్బు సంపాదించటం ఎంత కష్టమో

తెలిసింది. ఎంత కష్టపడి పని చేసినా తిండికే సరిపోతున్నది. డబ్బు మిగిల్చేది ఎలా? శ్రీమంతుడికి జీవితం మీదనే విరక్తిలాంటిది కలగసాగింది; మానవత్వం మీదా, మంచితనం మీదా నమ్మకం పోయింది.

ఒక రోజు రాత్రి శ్రీమంతుడు ఎవరి ఇంటి తాలూకు వీధి అరుగు మీదనే పడుకుని ఉండగా, ఇద్దరు ముసుగు ధరించిన దొంగలు ఎవరి ఇల్లో దోచుకుని, దోచినది మూట కట్టుకుని వీధి వెంట వస్తూ అతనికి కనిపించారు.



శ్రీమంతుడు వెంటనే అరుగు మీది నుంచి లేచి, గబగబాపోయి, వారి దారికి అడ్డంగా నిలబడ్డాడు.. దొంగల్లో ఒకడు, "ఏరా. బతకాలని లేదా?" అని శ్రీమంతుణ్ణి అడిగాడు.

ఒళ్ళు తెలియని కోపంలో శ్రీమంతుడు వాణ్ణి దవడ మీద బలంకొద్దీ చరిచాడు. ఆ దెబ్బకు వాడు నేలకరిచి మూలగ సాగాడు. అది చూసి రెండోవాడు వణికి పోయాడు.

"మర్యాదగా చెప్పండి. ఈ డబ్బు ఎక్కడిది? మీకు ఎలా వచ్చింది? మీ రెందు కిలా నీచంగా బ్రతుకుతున్నారు?" అని శ్రీమంతుడు దొంగలను అడిగాడు.

దానికి రెండో దొంగ, "అదేమిటి, బాబూ? డబ్బు ఎవరు సంపాదించినా నీతిగా, నియమంగా సంపాదించలేరు. ఈ మాటే మీరు ఈ డబ్బుగల వాళ్ళను అడిగితే, వాళ్ళు మాత్రం ఏం చెప్ప గలరు? తప్పు, బాబూ! డబ్బు ఎంత ఉన్నది అని అడగాలి గాని, ఎలా వచ్చింది అని అడగరాదు. డబ్బు సంపాదించగలవాడి ముందు సంపాదించ లేనివాడు నీచంగానే బతకాలి మరి! చేసుకున్న పెళ్ళాం కూడా డబ్బు సంపాదించమంటుందే గాని, ఫలాని విధంగా సంపాదించమనదు. నీకింకా డబ్బు సంగతి తెలియదులాగుంది, బాబూ.



దీని ముందు మంచితనం మాట ఎత్తితే బిగదీసుకుంటుంది,'' అన్నాడు.

శ్రీమంతుడు కొంచెం ఆలోచించి, ''డబ్బు నాకూ కావాలి. కొంచెం కాదు, లక్షలు కావాలి. నన్ను మీలో చేర్చుకుంటారా?'' అన్నాడు.

దొంగ నవ్వి, ''మాలో ఎంతమంది చేరినా ఇంకా చోటు ఉంటుంది. ఖాళీ లేదనటానికి ఇదేమన్నా ఉద్యోగమా, బాబూ? నీలాటి గుండెబలం గలవాడు మాతో చేరితే ఇంక మాకు కావలిసినదేముందీ? లక్షలుకాదు, కోట్లు గడించవచ్చు. ఆలశ్యం ఎందుకు? వెళదాం పద,'' అన్నాడు.

అలా శ్రీమంతుడు దొంగగా మారి, తన ధైర్యసాహసాలతో దొంగలకు నాయకుడై, ధనవంతులను దోచి, ధనరాసులను దొంగల రహస్యస్థావరానికి చేర్చాడు. దొంగగా మారినా అతనిలో మానవత్వం చావలేదు.

ఒకసారి అతనికి సుందరిని చూడాలనిపించింది. తన అనుచరులను గట్టివాళ్ళను నలుగురిని వెంటబెట్టుకుని, అందరూ పెద్దమనుషుల దుస్తులు ధరించి సుందరి ఊరు వెళుతూనే, శ్రీమంతుడు సుందరికి ఆ రాత్రే పెళ్ళికాబోతున్నదని తెలుసుకున్నాడు.

రాత్రి పొద్దుపోయి ముహూర్తం. సుందరి ఇల్లు బంధువులతో క్రిక్కిరిసి ఉన్నది. శ్రీమంతుడు పెళ్ళికొడుకునూ, అతని తండ్రినీ చూసి నిర్ఘాంతపోయాడు. వాళ్ళు పచ్చి దొంగలు! వాళ్ళను లోగడ శ్రీమంతుడు తాను దోచుకోబోతున్న పెళ్ళి పందిరిలో పెళ్ళికొడుకు గానూ, పెళ్ళికొడుకు తండ్రి గానూ చూసి ఉన్నాడు! తన మేనమామ ధనవ్యామోహంతో సుందరి గొంతు కోయబోతున్నాడు.

కర్తవ్యం ఏమిటో అప్పటి కప్పుడే నిర్ణయించి, తన అనుచరులు నలుగురూ ఏం చెయ్యవలిసిందీ చెప్పాడు శ్రీమంతుడు.

పెళ్ళి తంతు ప్రారంభమయింది. మంత్రాల గొడవా, బాజాల చప్పుడూ, అడావుడీ హెచ్చాయి. పెళ్ళికూతుర్ని వెనక గదిలో ఉంచారు. దగ్గిర ఎవరో ముత్తయిదు వున్నది. శ్రీమంతుడి అను చరుడు వచ్చి, ''నిన్ను పిలుస్తున్నా రమ్మా!'' అని ఆమెను తీసుకుపోయాడు. ఒంటరిగా ఉన్న సుందరిని మరొకడు, ''మీ బావ వచ్చాడు, తల్లీ. ఒక్కమాట మాట్లాడిపో,'' అంటూ ఇంటి వెనక్కు తీసుకుపోయాడు.

పురోహితుడు, "పెళ్లికూతురు రావాలి!" అని కేక పెట్టాడు. కాని పెళ్ళికూతురి జాడ ఎవరికీ తెలీదు. పెళ్ళిసంబరం అంతలోనే ఆందోళనగానూ, పెడబొబ్బలు గానూ మారింది. నలుగురూ పెళ్ళి కూతురిని వెతుకుతూ ఊరి మీద పడ్డారు.

ముహూర్తం తప్పిపోయింది. అందరూ అలిసిపోయి నిద్రలకు పడ్డారు.

పెళ్ళికొడుకూ, పెళ్ళికొడుకు తండ్రీ ఏం చేస్తారో శ్రీమంతుడు సరిగా ఊహించి, తెల్లవారుఝామున వాళ్ళు పెళ్ళివారిని దోచుకుని పారిపోతుంటే, తన అనుచరులతో అటకాయించి పట్టుకుని, దొంగ సొమ్ముతో సహా ఆ ఇద్దరినీ బంధించి తన మేనమామ ఇంటికి తెచ్చాడు. అదే సమయంలో శ్రీమంతుడి అనుచరుడు ఒకడు సుందరిని కూడా తెచ్చాడు.

''మామా, నన్ను కాదని సుందరికి చాలా గొప్ప సంబంధం తెచ్చావులే!'' అన్నాడు శ్రీమంతుడు.

''నాకు బుద్ధి వచ్చిందిరా, బాబూ. నువు దేవుడల్లే సమయానికి అడ్డపడక పోతే నిష్కారణంగా పిల్ల గొంతు కోసి ఉండేవాణ్ణి,'' అన్నాడు శ్రీమంతుడి మేనమామ.

చేసిన ప్రయత్నాలు వృధాకాకుండా, బంధువులకు నిరాశకలగకుండా, సుందరి తండ్రి తన కూతుర్ని త్వరలోనే శ్రీమంతుడికి ఇచ్చి చేశాడు. శ్రీమంతుడు దొంగతనాలు మాని, సుందరితోబాటు మామ ఇంటనే సుఖంగా ఉండిపోయాడు.






సీనయ్యా, సీతయ్యా సామాన్య కుటుంబీకులు. వాళ్ళకు బంగారాన్ని చేసే విద్య సాధించాలని ఆశ ఉండేది. కని పించిన ప్రతి బైరాగినీ వాళ్ళు, "నీకు బంగారం చేసే విద్య తెలుసా?" అని అడిగేవాళ్ళు.

కొన్నాళ్ళకు వాళ్ళతో ఒక బైరాగి, "ఆ విద్య మా గురువుగారికి తెలుసు. ఆయన ఊరవతల కొండల్లో ఉంటారు," అన్నాడు. వెంటనే వాళ్ళు బైరాగి గురువు వద్దకు వెళ్ళి, నమస్కరించి, తమ కోరిక బయటపెట్టారు.

గురువు మందహాసంచేసి, "బంగారం చేసే విద్య నాకు తెలుసు. కాని గురు దక్షిణ కింద ఒక్కొక్కరివద్దా అయిదేసి బంగారుకాసులు తీసుకుని గాని ఆ విద్య చెప్పను. గురుదక్షిణ ఇచ్చుకుంటే గాని విద్య ఫలించదు," అన్నాడు.

సీనయ్యా, సీతయ్యా తమ వద్ద ఉన్న డబ్బుతో అయిదేసి బంగారుకాసులు కొని, గురువును కలుసుకున్నారు. ఆయన వారిచ్చిన బంగారం తీసుకుని, "మీ కొక మంత్రం చెబుతాను. దాన్ని కంఠస్థం చెయ్యండి. కాగితం మీద రాస్తే దాని ప్రభావం పోతుంది," అంటూ వారికి ఒక కఠినమైన శ్లోకం చెప్పాడు.

సీతయ్య ఆ శ్లోకాన్ని తేలికగానే కంఠస్థం చేసుకున్నాడు గాని, సీనయ్యకు నోరు తిరగలేదు. "స్వామీ, బంగారం చేసే విద్య నాకు అబ్బేలా లేదు," అన్నాడు అతను విచారంగా.

గురువు ఒక్కక్షణం ఆలోచించి, "నీ దురదృష్టానికి నేనేమి చేయగలను? అయితే ఒక చిన్న సహాయాన్ని చేయ గలను. ఇప్పుడు ఎలాగూ సీతయ్య మంత్ర ప్రభావాన్ని పరీక్షించాలి. ఆ పరీక్షలో

తయారయిన బంగారాన్ని నువు తీసుకో," అన్నాడు.

తరవాత ఆయన సీతయ్యతో, "ఈ రోజు శుక్లనవమి. ఇకనుంచీ నువు శుక్లనవమి నాడే బంగారం చెయ్యాలి. అంటే, నెలకు ఒకరోజన్నమాట! అదికూడా ఒకే ఒక సారి! ఈ నియమాలు పాటించకపోతే మాత్రం నీకు మంత్రం ఏమీ పని చెయ్యదు," అన్నాడు.

ఆయన రెండు శేర్ల పాలు పట్టే పిడతను తెచ్చి, దాన్ని ఇసుకతో నింపి, దానిమీద ఆకులు కప్పి, సీతయ్యను కళ్ళు మూసుకుని మంత్రం పఠించ మన్నాడు. సీతయ్య మంత్ర పఠనం ముగించి, పిడత మీది ఆకులు తీసి చూస్తే, పిడతలో ఇసుకకు బదులు ధగధగ మెరిసే బంగారుకాసు లున్నాయి!

గురువు ఆ పిడతను సీనయ్య కిచ్చాడు. అందులోని బంగారం చూడగానే సీనయ్య కళ్ళు మెరిశాయి. దానితో తన జీవితమంతా సుఖంగా వెళ్లిపోతుందనుకున్నాడు.

తరవాత గురువు వాళ్లిద్దరినీ ఉద్దేశించి, "నాయనలారా, నే నిక్కడ ఎంతోకాలం ఉండను. మీకు ఏవైనా సందేహాలుంటే ఈ గుహకు రండి. మీకు సందేహనివృత్తి అయ్యే ఏర్పాటు నేను చేస్తాను. ఇక వెళ్ళిరండి," అన్నాడు.



ఆయన వద్ద సెలవు పుచ్చుకుని సీతయ్యా, సీనయ్యా తమతమ ఇళ్ళకు తిరిగివెళ్ళారు.

సీనయ్య తన బంగారు పిడతకు వాసెన కట్టి, దాన్ని రహస్యంగా ఒక రాత్రివేళ తన దొడ్లో పాతిపెట్టాడు.

సీతయ్య మళ్ళీ శుక్లనవమి కోసం ఆత్రంగా ఎదురుచూసి, ఆ రోజు రాగానే తన ఇంట్లో ఉన్న పెద్ద గంగాళం నిండా ఇసుక నింపి, దానిమీధ ఆకులు కప్పి, కళ్ళు మూసుకుని గురువు చెప్పిన మంత్రం పఠించాడు.

తరవాత ఆకులు తీసి చూస్తే గంగాళంలో ఇసుక యథాతథంగా

ఉన్నది. గంగాళాన్ని కెలికి, కుళ్ళగించి, బోర్లించి, ఎంత వెతికినా ఆ ఇసుకలో బంగారం నలుసంత కూడా లేదు. సీతయ్య సీనయ్య ఇంటికి కంగారుగా పరిగెత్తాడు.

అంతా విని సీనయ్య, "సీతయ్యా, నువు మంత్రం తప్పుగా చదివి ఉంటావు. ఒకంతట నోరు తిరిగే మంత్రం కాదు గద!" అన్నాడు.

సీతయ్య తనకు మంత్రం తప్పు లేకుండా వచ్చునన్నాడు.

"నువు అత్యాశకు పోకుండా ఉండవలిసింది, సీతయ్యా. నీకు పిడతెడు బంగారం చాలకపోయిందా? పోనీలే, నేను మాత్రం రెండు శేర్ల బంగారం ఏం చేసుకుంటాను? ఒక సోలెడు నీకు ఇస్తాలే!" అన్నాడు సీనయ్య.

అతను తాను పాతిన పిడతను తవ్వి తీసి, వాసెన విప్పి చూస్తే, అందులోని నాణాలు మెరవటం లేదు. దాన్ని వాళ్ళిద్దరూ కంసాలికి చూపారు.

"ఛీ, ఛీ! ఇది బంగారం ఎందుకయింది? ఒక బంగారునాణెం ఖరీదుతో ఇలాటి నాణాలు పదివేలు చెయ్యొచ్చు," అన్నాడు కంసాలి.

మిత్రులిద్దరూ ఈ మోసం గురించి తెలుసుకోవాలని కొండగుహకు పరిగెత్తారు. అక్కడ ఎవరూ లేరుగాని, ఒక ఉత్తరం మీద చిన్న రాయి బరువు పెట్టి ఉన్నది. ఉత్తరంలో ఇలా ఉన్నది:

"నాయనలారా! మంత్రాలతో ఏ వస్తువూ బంగారం కాదు. కష్టం చెయ్యకుండా ఎవరికీ బంగారం లభ్యం కాదు. కాని కష్టపడకుండా బంగారం చెయ్యటానికి ఒకే ఒక మార్గం ఉన్నది. తెలివితేటలున్నవాడు ఇతరుల తెలివి తక్కువను బంగారంగా మార్చవచ్చు. ఇదే నాకు తెలిసిన బంగారం చేసే విద్య. బంగారం చెయ్యడానికి మీరు మీ కంటె తెలివి తక్కువ వాళ్ళను వెతుక్కోండి. ఇదే నేను మీ కియ్యగల సలహా!"





# అత్తరు సాయిబు

ఒక ఊళ్ళో అమీర్, హసన్ అనే ఇద్దరు స్నేహితులు ఉండేవారు. అమీర్ అమిత బద్ధకస్తుడు; పైపెచ్చు ఎప్పుడూ ఏదో సమస్యలో చిక్కుకుని, దానినుంచి బయటపడలేకపోయేవాడు. హసన్ వచ్చి అతన్ని కాపాడవలసి వచ్చేది.

వాళ్ళిద్దరూ ఏదైనా వర్తకం చేసి కొంత డబ్బు సంపాదించుకుని, తరవాత పెళ్ళిళ్ళు చేసుకుందామనుకున్నారు. వాళ్ళకు ప్రత్యేకంగా ఏ పనిలోనూ ప్రవేశంలేదు గనక ఎవరూ పని ఇయ్యరు. వ్యాపారానికి కొంత పెట్టుబడి కావాలి. అందుచేత, ఇద్దరూ తమ పాత ఇళ్ళు అమ్మేసి, ఆ డబ్బుతో రకరకాల అత్తర్లు కొని, అత్తరు సీసాలు రెండు తోలు పెట్టెల్లో అమర్చి, చెరొకటీ తీసుకుని వాటిని అమ్ముకు రావటానికి బయలుదేరారు.

అమీర్ తూర్పుగా బయలుదేరాడు. వాడు రోజల్లా అడవి దారిన ప్రయాణం చేసి, చీకటి పడే వేళకు అడవి చివరకు చేరుకున్నాడు. వాడికి తన ఒళ్ళూ, దుస్తులూ చెమట కంపు కొట్టుతున్నట్టు తోచింది. అత్తరు సాయిబు అన్నాక అంత దూరాన ఉండగానే అత్తరు వాసన కొట్టాలి. దానికి బదులుగా తాను చెమట వాసన కొట్టటం ఎంతమాత్రమూ వ్యాపారధర్మం కాదు.

అందుచేత అమీర్ ఒక మర్రిచెట్టు కింద కూర్చుని, తోలు పెట్టె తెరిచి, ఒక అత్తరు సీసా బైటపెట్టి, అందులో దూది ముంచి తన బట్టలకు అత్తరు రాచుకోసాగాడు.

అంతలోనే మర్రి ఊడలు గలగలలాడాయి. అమీర్ ఆశ్చర్యపోతూ చూసేంతలో, ఒక పెద్ద స్త్రీ ఆకారం అతడి ఎదట

ఎం. కామేశ్వరరావు



ప్రత్యక్షమై, ''ఏం చేస్తున్నావు?'' అని అడిగింది.

అదేదో దయ్యమని గ్రహించి అమీర్ కోపంగా, ''కనబడటంలేదూ? అత్తరు రాచుకుంటున్నాను,'' అన్నాడు.

''నాక్కూడా రాయవూ?'' అన్నది దయ్యం

''నీకు ఒకరు రాయాలా? చిన్న రూపంలో అత్తరు సీసాలోకి వెళ్ళి, ఒళ్ళంతా తడుపుకుని పైకిరా!'' అన్నాడు అమీర్.

దయ్యం చిన్నదిగా అయి సీసాలోకి దూరినట్టు కనబడగానే అమీర్ సీసాకు బిరడా పెట్టేసి, సీసాను తోలు పెట్టెలో పెట్టి, అక్కడినుంచి కదిలి, బాగా చీకటి పడిన కొద్దిసేపటికి ఒక గ్రామం చేరుకున్నాడు.

ఆ గ్రామంలో ఆ రాత్రి బసచేసి వాడు ఒక ఆలోచన చేశాడు. తన వద్ద ఉన్న అత్తరుసీసాలు ఊళ్ళ వెంబడి అమ్ముతూ పోతే తన సరుకంతా ఎప్పటికి అమ్ముడుకాను? రెండు రోజులు ప్రయాణం చేస్తే రాజధాని నగరం వస్తుందట. రాజుగారి కూతురికి పెళ్లి కూడా జరగబోతున్నదిట. తన సరుకంతా రాజుగారికి కానుకగా ఇచ్చినా, తనకు రాజుగారిచ్చే బహుమానం ఎంతో గిట్టుబాటుగా ఉంటుంది!

ఇలా అనుకుని అమీర్ తిన్నగా రాజధానికి వెళ్లి, రాజుగారి దర్శనం నిమిత్తం దూరదేశం నుంచి అత్తరు సాయిబు వచ్చాడని లోపలికి కబురు చేశాడు. అతనికి రాజుగారి దర్శనం లభించింది. తాను తెచ్చిన అత్తరు సీసాలు రాజుగారి ముందుంచి, అవి రాజకుమార్తె వివాహ సందర్భంగా తాను సమర్పించుకుంటున్న కానుక అని చెప్పాడు.

రాజు తన కుమార్తెను పిలిచి, ఆ అత్తర్లు ఎలా ఉన్నాయో చూడమన్నాడు. రాజకుమార్తె ఒక సీసా బిరడా తీసి, అత్తరు వాసన చూసి, మతిపోయినదానిలాగా, ''హాయ్, హాయ్!

నాకు పెళ్ళి! నలభై ఏళ్ళకు మళ్ళీ పెళ్ళి!'' అంటూ చిందులు తొక్కటం ప్రారంభించింది.

నిక్షేపంలా ఉన్న పిల్ల అకస్మాత్తుగా అలా అయిపోవటానికి కారణం అత్తరు సాయిబు అమీరేనని నిశ్చయించి రాజు, ''ఈ ద్రోహిని తీసుకుపోయి చెరసాలలో వెయ్యండి!'' అని తన భటులకు ఉత్తరువు ఇచ్చాడు.

ఖైదులో ఉండగా అమీర్‌కు జరిగిన సంగతి అర్థమయింది. రాజు కూతురు దయ్యం ఉన్న సీసా బిరడా తెరిచింది. దయ్యం బయటికి వచ్చి ఆమెను పట్టుకున్నది. ఎక్కడో అడవిలో ఉంటున్న దయ్యానికి రాణివాసం దొరికింది. అది రాజకుమార్తెను వదలదు.

''నేను రాజకుమార్తెను బాగు చేసే ఉపాయం చెబుతాను,'' అని అతను రాజుకు కబురు చేశాడు.

రాజు అమీర్‌ను భటుల వెంట తన వద్దకు రప్పించి, ''ఏమిటి నువు చెప్పే ఉపాయం?'' అని అడిగాడు.

"మహారాజా, అమ్మాయిగారిని పట్టినది ఒక దయ్యం. నేను దాన్ని నా అత్తరు సీసాలో బంధించి ఉంచాను. దురదృష్ట వశాన అమ్మాయిగారు దాని మూతే తెరిచారు. అందుచేత మీరు అమ్మాయి



గారిని నాకిచ్చి పెళ్ళిచేస్తే, దానికి అరణ్యపు జీవితమే బాగున్నదనిపించే లాగు చేస్తాను. అప్పుడది అమ్మాయి గారిని వదిలి పోతుంది. అంతేగాని, రాజభోగాలు జరిగినంత కాలమూ అది వదలదు,'' అన్నాడు అమీర్.

ఈ మాట విని రాజు మండిపడ్డాడు. అంతదాకా రాజుకు ఆ అత్తరుసాయిబు ఆశయం ఏమిటో తెలిసింది కాదు. ఇప్పుడది బయటపడింది—వాడు రాజకుమార్తెను పెళ్ళాడాలనే ఈ దుర్మార్గ మంతా చేశాడు!

''అమావాస్యనాడు వీణ్ణి ఉరి తీసెయ్యండి,'' అన్నాడు రాజు భటులతో.

అమావాస్య ఇంకా కొద్ది రోజులున్నది. అమీర్ రాజభటులను బతిమాలుకుని, తన స్నేహితుడైన హసన్‌కు కబురు చేశాడు. కబురు అందుతూనే హసన్ రెక్కలు కట్టుకుని వచ్చి, అమీర్ గొంతు మీదికి వచ్చిన సమస్య ఏమిటో పూర్తిగా అర్థం చేసుకున్నాడు.

అతను తిన్నగా రాజుగారి దగ్గిరికి వెళ్ళి, రాజకుమార్తెకు పట్టిన దయ్యాన్ని తాను వదలగొడతానన్నాడు.

"ఆమెను నీకిచ్చి పెళ్ళి చెయ్యమంటావా ఏమిటి?" అని రాజు వెటకారంగా అడిగాడు.

"అవసరంలేదు. కాని నేను రాజకుమార్తె సమక్షంలో ఏం మాట్లాడినా ఎవరూ నాకు ఎదురూ, అడ్డూ చెప్పరాదు. ముందు నాకు మనిషి ఎత్తు గాజు జాడీ, మూతతో సహా కావాలి, తెప్పించండి." అన్నాడు హసన్.

రాజు వెంటనే అలాటి జాడీ తెప్పించాడు. హసన్ దాన్ని రాజకుమార్తె ఉన్నచోటికి పట్టించుకుపోయి, "రాజకుమార్తెను ఆ జాడీలో ఉంచి, మూత బిగించండి." అన్నాడు

వెంటనే రాజకుమార్తె కెవ్వున అరిచి, విరుచుకు పడిపోయింది. తనకు మళ్ళీ బందిఖానా సంప్రాప్తం కాబోతున్నదని భయపడి, దయ్యం ఆమెను వదిలి పారిపోయింది.

తిరిగి రాజకుమార్తెకు ఒళ్ళు తెలిసేసరికి ఆమె మామూలు మనిషి అయి ఉన్నది.

రాజు పొందిన ఆనందం ఇంతా, అంతా కాదు. ఆయన హసన్‌కు గొప్ప బహుమానం ఇయ్యటమేగాక, అతని కోరికపైన అమీర్‌ను ఖైదు నుంచి వదిలి పెడుతూ, అతనికి కూడా చిన్న సత్కారం చేశాడు.

తరవాత స్నేహితులిద్దరూ తమ గ్రామానికి తిరిగి వచ్చి, పెళ్ళిళ్ళు చేసుకుని, రాజుగారిచ్చిన డబ్బుతో సుఖంగా జీవించారు.



# తారుమారు

రామశాస్త్రి అనే పండితుడు సంతానం లేక, గిరినాధుడు అనే కుర్రవాణ్ణి పెంచుకున్నాడు. తరవాత ఆయనకు నిజంగానే కొడుకు కలిగాడు. గత్యంతరం లేక రామశాస్త్రి తన పెంపుడు కొడుకును ఇంటి పనివాడుగా వాడుకుంటూ, వాడికి చదువు సంధ్యలు నేర్పక, తన సొంత కొడుకును మహా పండితుడుగా తయారు చేశాడు.

గిరినాధుడు చిత్రకళ అభ్యసించాడు.

ఒకసారి ఒక జమీందారు తన పుట్టిన రోజు చేసుకుంటూ కళాకారులనూ, కవి పండితులనూ సన్మానాలు ప్రకటించాడు. రామశాస్త్రి తన సొంత కొడుకును తీసుకుపోయాడు. గిరినాధుడు తన బొమ్మలు తీసుకుపోయాడు. జమీందారు అందరు కళాకారులనూ పరీక్షించి, వారికి మర్నాడు ఇచ్చే బహుమానాలకు సంకేతాలుగా ఏవేవో ఇచ్చాడు. రామశాస్త్రి సొంత కొడుక్కు ఒక నీలం పువ్వు వచ్చింది, గిరినాధుడికి ఎర్రపువ్వు ఇచ్చారు. ఎర్రపువ్వు మరెవరికీ రానందుకు గిరినాధుడు పొంగిపోవటం చూసి రామశాస్త్రి ఈర్ష్యపడి, మర్నాడు ఉదయం తన సొంత కొడుక్కు ఆ ఎర్రపువ్వు ఇచ్చి పంపి, గిరినాధుడికి నీలం పువ్వు ఇచ్చాడు.

ఎర్ర పువ్వు చూడగానే మంత్రి రామసాస్త్రి సొంత కొడుక్కు కొరడా దెబ్బలు విధించి, నీలం పువ్వు తెచ్చిన గిరినాధుడికి బంగారు నాణాలు ఇచ్చాడు. చదువు సంధ్యలు లేని గిరినాధుడు జమీందారు దగ్గిర అసభ్యంగా ప్రవర్తించాడట. —చెల్లూరి సీతారాజేశ్వరరావు.





# మోసానికి మోసం

ఒక గ్రామంలో షావుకారు శరభయ్య అనే ధనికుడు, ఎంత ధనం సంపాదించినా తృప్తి కలగక, మరింత ధనం సులభంగా సంపాదించటానికి ఒక ఎత్తు వేశాడు.

ఒకరోజు శరభయ్య, వీధుల వెంబడి అడుక్కుంటున్న పదిహేనేళ్ళ కుర్రవాణ్ణి పట్టుకొచ్చి, తన ఉపాయం వాడికి చెప్పి, "నువు తెచ్చిన దానిలో సగం నీకిస్తాను. నా వద్ద రెండురోజులుండగలవా?" అన్నాడు.

తిండికి మొహం వాచిన బిచ్చగాడు శరభయ్య కోరినట్టు చెయ్యటానికి సమ్మతించాడు.

ఒక రాత్రి శరభయ్య అకస్మాత్తుగా, "దొంగలు! దొంగలు! రక్షించండి!" అని ఇంటికప్పు ఎగిరిపోయేలా గట్టిగా అరవసాగాడు.

శరభయ్య అరుపులకు చుట్టుపక్కల ఇళ్ళవాళ్ళు కత్తులూ, కొడవళ్ళూ తీసుకుని, శరభయ్య ఇంటికి పరిగెత్తుకుంటూ వచ్చారు.

ఈ లోపల శరభయ్య దొడ్డివైపు ఉండే ఇంటి తలుపులు తెరిచి ఉంచి, దొంగలు అటుగా వెళ్ళినట్టు ఇరుగు పొరుగు వాళ్ళకు చూపాడు. వాళ్ళు చాలాసేపు దొంగల కోసం వెతికి, దొంగలు దొరక్క, శరభయ్యకు ధైర్యం చెప్పి తమ తమ ఇళ్ళకు వెళ్ళిపోయారు.

ఇదంతా జరుగుతూండగా, శరభయ్య చేరదీసిన కుర్రవాడు ఇరుగు పొరుగు ఇళ్ళ దొడ్లలో ఉన్న పాత్రలూ అవీ ఒక గోతంలో వేసుకుని, శరభయ్య ఇంటికి తిరిగి వచ్చాడు.

శరభయ్య తలుపులన్నీ మూసి, మూట విప్పి అందులోని పాత్రలనూ, వస్తువు

అవులపాటి రెడ్డెప్ప

లనూ చూసి, కుర్రవాణ్ణి పొగడుతూ, "నువు వీటిని ఎత్తుకురావటం ఎవరూ చూడలేదు గద ?" అన్నాడు.

తనను శరభయ్య మెచ్చుకున్నందుకు కుర్రవాడు పొంగిపోతూ, "అందరూ నీ అరుపులు విని, నీ దగ్గిరికి చేరారు. వాకిళ్ళన్నీ తెరిచి ఉన్నాయి. వారి దొడ్లలో దొరికిన వస్తువులన్నీ తెచ్చాను. నా వాటా నా కిచ్చెయ్యి." అన్నాడు.

అందుకు శరభయ్య, "నీ వాటా ఇస్తే ఆ వస్తువులను ఎక్కడ దాచు కుంటావు ? రెండు రోజులు పోనీ, నీది నీ కిచ్చేస్తాను." అని కుర్రవాడికి నచ్చ జెప్పి అవతలికి పంపేసి, ఒక మూలనున్న నేల మాళిగలో వస్తువులు దాచి, కుర్ర వాడికి ఖర్చులకు రెండు రూపాయలిచ్చి, తాను వెళ్ళి పడుకున్నాడు.

మర్నాడు అర్ధరాత్రి శరభయ్య మళ్లీ, "దొంగలు! దొంగలు!" అంటూ అరిచాడు. శరభయ్య కుట్ర తెలియని ఇరుగు పొరుగువాళ్ళు శరభయ్య ఇంటికి పరిగెత్తుకువచ్చారు. శరభయ్య వారు రావటం గమనించి, కళ్ళు గట్టిగా మూసుకుని, "దొంగలు, దొంగలు" అని అరుస్తూ, వణకసాగాడు.

పడుకుని వణుకుతున్న శరభయ్యను ఎవరో తట్టి లేపారు. వెంటనే శరభయ్య



ఉలిక్కిపడి, తనను లేపినవాణ్ణి గట్టిగా పట్టుకుని, "దొంగ, దొంగ!" అని అరిచాడు.

"పాపం, శరభయ్య నిన్నటి దెబ్బకు కలవరపడ్డాడు." అని వచ్చిన వారంతా సానుభూతి మాటలతో ధైర్యం చెప్పి, "నిన్న రాత్రి మా ఇళ్ళలో కూడా దొంగ తనం జరిగింది. రేపటి నుంచి రాత్రిపూట ఊరు చుట్టూరా కాపలా ఉంచుతాం. భయం లేదు." అని చెప్పి, తమ దారిన వెళ్ళిపోయారు.

వాళ్ళు వెళ్ళిపోయాక కుర్రవాడు వచ్చి, "మీరు చెప్పిన రెండు రోజులూ అయిపోయాయి. నాకు రావలసిన వాటా

నాకు ఇచ్చెయ్యండి. మా ఊరు వెళ్ళి పోతాను,'' అన్నాడు.

''రేపు పట్నం వెళ్ళి, వస్తువులు అమ్మేసి, ఆ డబ్బులో నీవాటా నీకిస్తాను,'' అని మంచి మాటలతో శరభయ్య కుర్ర వాణ్ణి ఒప్పించాడు.

అలాగే శరభయ్య మర్నాడు పట్నం వెళ్ళి, దొంగ సామానులన్నీ లాభసాటిగా అమ్మి, ఇంటికి తిరిగి వచ్చాడు.

కుర్రవాడు మధ్య దారిలో శరభయ్యను కలుసుకుని, అతడి వెంట ఇంటిదాకా వచ్చి, తన వాటా డబ్బు తనకు ఇయ్య మని అడిగాడు.

శరభయ్య వాడి కేసి వింతగా చూసి, ''నువ్వెవరో నాకు తెలీదు, పోరా! కావాలంటే నీ యిష్టం వచ్చిన చోట ఫిర్యాదు చేసుకో!'' అని వాణ్ణి బయటికి గెంటేశాడు.

కుర్రవాడు శరభయ్య ఏమిచ్చినా పుచ్చుకుందామనే ఉద్దేశంతో వెనక్కు తిరిగివచ్చి, శరభయ్య తాను పట్నంనుంచి తెచ్చిన డబ్బును పూజాగృహంలో విగ్రహం కింది అరలో దాచటం చూశాడు.

ఆ డబ్బు ఎలాగైనా కాజెయ్యాలని నిశ్చయించుకుని, వాడు ఆ రాత్రి ఒక చెట్టు కింద పడుకుని ఉండగా, దూరాన గుసగుసలు వినిపించాయి. వాళ్ళు దొంగలు. కుర్రవాడు వాళ్లను సమీపించి, తనకు శరభయ్య చేసిన మోసం వాళ్లకు చెప్పి, డబ్బు రహస్యం తెలిపి, వాళ్ళు దొంగిలించి తెచ్చిన దానిలో తనకు కొంత వాటా ఇయ్యమన్నాడు.

దొంగలు అందుకు ఒప్పుకుని, శరభయ్య ఇంట ప్రవేశించి, శరభయ్యను కట్టేశారు. శరభయ్య, ''దొంగలు, దొంగలు!'' అని అరిచాడు.

శరభయ్య కలవరపడుతున్నాడు లెమ్మని చుట్టుపక్కలవాళ్ళు ఎవరూ రాలేదు. దొంగలు శరభయ్య ఇంట్లో ఉన్న మొత్తం డబ్బూ, వస్తువులూ దోచేసి, కొంత డబ్బు కుర్రవాడి చేతిలో పెట్టి, వెళ్ళిపోయారు.



# పిడుగుపాటు

రత్నగిరిని ఏలే రత్నపాలుడు వనభోజనం ఏర్పాటు చేశాడు. కాలక్షేపం కోసం రత్నపాలుడు తన విదూషకుణ్ణి తన పక్కనే భోజనాల దగ్గిర కూర్చోబెట్టుకున్నాడు. అనేక వందల మంది మీద వడ్డన జరుగుతున్నది. అందరి విస్తళ్ళలోనూ లడ్డూలు వడ్డించారు. పొరపాటున విదూషకుడి విస్తట్లో లడ్డూ పడలేదు.

అతను రత్నపాలుడి వైపు తిరిగి, "ఇప్పుడు అకస్మాత్తుగా మేఘాలు కమ్మి, వాన ముంచుకొచ్చి, మీ అందరి మీదా పిడుగుపడితే?" అన్నాడు.

"మా మీద పిడుగే పడితే అది నీ మీద మాత్రం పడదా?" అన్నాడు రత్నపాలుడు.

"అదేం మాట? మీ అందరి విస్తళ్ళల్లోనూ పడిన లడ్డూ నా విస్తట్లో పడిందా?" అన్నాడు విదూషకుడు.

రత్నపాలుడు నవ్వి, వడ్డనవాళ్ళను పిలిచి, విదూషకుడికి లడ్డు వేయించాడు.

—ఎం. మంజురాణి.





# మంచి మనసు

సారంగుడు అనే యువకుడు సకల శాస్త్రాలూ అభ్యసించి, బతుకుతెరువు కోసం తన దేశపు రాజధాని అయిన మణిపురం వచ్చాడు. రాజుగారి కొలువులో ఉద్యోగం చేసే అర్హత అతనికి ఉన్నది. కాని అతను దివాణానికి సమీపంగా కూడా వెళ్ళలేకపోయాడు. కోట బయటి ద్వారం దాటి లోపలికి అడుగుపెట్టాలన్నా ఎంతో పలుకుబడీ, శిఫార్సూ, లంచాలు పెట్టే శక్తీ కావాలి: అంతేగాని చదువూ, సంస్కారమూ, పాండిత్యమూ ఎందుకూ పనికిరావు!

ఇది స్పష్టంగా గ్రహించిన సారంగుడు ఆగ్రహావేశుడైపోయాడు. తనకూ, ఉద్యోగానికీ మధ్య అడ్డుగా నిలబడ్డవాళ్ళు తనతో పోల్చితే గడ్డిపోచ విలువ చెయ్యరని అతను రూఢి చేసుకున్నాడు. కాని ఆ సంగతి ఎవరు గుర్తించి తనకు సహాయం చేసేటట్టు? అర్హత వేరూ, అధికారం వేరూనూ! అర్హత అధికారానికి లొంగి ఉండక తప్పదు.

అతను తన గురువు వద్దకు తిరిగి వెళ్ళి, తన అనుభవం చెప్పి, "గురుదేవా, నేను సన్మార్గంగా బతకలేనని తోస్తుంది. దుర్మార్గంగా బతకటానికి ఒకరి అనుమతి అవసరం లేదు. దుర్మార్గమే అధికారంగా చలామణీ అవుతున్నది. అందుచేత, నేను కూడా దుర్మార్గంగా— అంటే, దొంగతనాలూ, కుట్రలూ, అవసరమైతే హత్యలూ చేసి బతుకుతాను," అన్నాడు.

గురువు తల ఆడించి, "అందుకు కావలసిన శిక్షణ నువు పొందలేదు, నాయనా. నా వద్ద నువు నేర్చిన విద్య నీకు మంచి మనసు కలిగించేదేగాని, దుర్మార్గానికి అనుకూలమైనది కాదు.

జి. రాము

అయినా నీ బుద్ధికి తోచిన పని చేసి చూడు.'' అన్నాడు.

మనిషి మంచిపనులూ, చెడ్డపనులూ పరిస్థితుల ప్రోద్బలం వల్లనే చేస్తాడనీ, వాటికి శిక్షణతోనూ, మనస్తత్వంతోనూ ఎలాటి సంబంధమూ లేదనీ నమ్మి, సారంగుడు దొంగగా బతకదలచి, మణిపురానికి తిరిగివచ్చాడు.

ఒకరోజు రాత్రి చాలా పొద్దుపోయి సారంగుడు దొంగతనానికి ఒక ఇంటి పెరడులోకి ప్రవేశించాడు. పెరడును అనుకుని ఉన్న గదిలో దీపం వెలుగుతున్నది. సారంగుడు గది దగ్గరకుపోయి, గోడవారగా నక్కి, గదిలో జరిగే సంభాషణ విన్నాడు.

ఇంటి యజమాని తన భార్యతో, ''ఎలాగైతేనేం, పాపం, బాకీలున్నవారంతా ఆదుకుని డబ్బు ఇచ్చేశారు. పదివేల వరహాలు చేరాయి. ఇక భయంలేదు. అమ్మాయి పెళ్ళి నిర్విఘ్నంగా సాగుతుంది.'' అంటున్నాడు.

ఆయన తన భార్యకు వరహాల సంచీ ఇయ్యటమూ, ఆమె దాన్ని పెట్టెలో పెట్టటమూ సారంగుడు చూశాడు. అలాటి డబ్బు దొంగిలించటం మహాపాతకమనీ, డబ్బు దొంగిలిస్తే, దానితో ఏం చెయ్యాలో తెలియని స్థితిలో ఉన్న ధనికుల వద్దనే కాజెయ్యాలిగాని, ఇలాటి అక్కర కోసం కష్టపడి వసూలు చేసినది దోచరాదనీ సారంగుడికి అనిపించింది.



అతను దొంగతనం చేసే ఉద్దేశం మానుకుని దూరంగా వెళ్ళాడు. అదే సమయంలో మరొక వ్యక్తి, గోడదూకి అదే పెరడులోకి ప్రవేశించటం అతని కంటపడింది.

ఆ మనిషి దొంగే అయి ఉండాలి. సారంగుడు వెళ్ళిపోయే ఉద్దేశం మార్చుకుని ఒక చెట్ల గుబురు వెనక నక్కి, దొంగను గమనించసాగాడు.

ఇంటి వాళ్ళు దీపాలు ఆర్పి నిద్ర పోయినదాకా దొంగ ఏమీ చెయ్యలేదు. తరవాత వాడు నిశ్శబ్దంగాపోయి, పెరటి వేపు ఉన్న గది గోడకు కన్నం వేసి, లోపల ప్రవేశించాడు.

వాడు గదిలో పెట్టె తెరిచి, వరహాల మూట తీసుకుని, మళ్ళీ కన్నంకుండా బయటికి రాబోవటం కిటికీకుండా గమనించి, సారంగుడు కన్నంవద్ద చేరి, బయటికి వచ్చే దొంగను బలంగా పట్టుకుని, "దొంగ! దొంగ!" అని గట్టిగా అరిచాడు.

ఇంటివాళ్ళు లేచారు. ఇరుగు పొరుగు వాళ్ళు చేరి దొంగను పట్టుకుని, రాజ భటులకు అప్పగించారు.

దొంగ విచారణ జరిగేటప్పుడు రాజు గారు సారంగుణ్ణి పిలిపించి సాక్ష్యం అడిగారు. తాను ఫలానా శాస్త్రాలు చదివాననీ, ఉద్యోగం కోసం వెతుకు తున్నాననీ, దొంగ ఒకరి పెరట్లో ప్రవేశించటం చూసి, అనుమానం వేసి వాణ్ణి వెంబడించి, దొంగతనం చేసి వస్తూండగా పట్టుకున్నాననీ రాజుగారికి చెప్పాడు.

రాజుగారు సారంగుణ్ణి మెచ్చుకుని, అతనికి బహుమానం ఇయ్యటమేగాక, తన కొలువులో అతని విద్యాబుద్ధులకు తగిన ఉద్యోగం కూడా ఇచ్చాడు.

తరవాత సారంగుడు తన గురువును కలుసుకుని, "గురుదేవా! మీ రన్నది నిజమే. నాకు దొంగతనం చాతకాలేదు. కాని నే నన్నదీ నిజమే. నా దుర్మార్గం కాకపోయినా, మరొకడి దుర్మార్గం నాకు బతుకుతెరువు చూపింది!" అన్నాడు.



# లౌక్యం

ఒక మహాపండితుడు కృష్ణదేవరాయల సన్నిధికి వెళ్ళి, తన పాండిత్యాన్ని ప్రదర్శించి, వెయ్యి వరహాలు బహుమానంగా పుచ్చుకున్నాడు. అతనికి నగరంలో తెలిసిన వారెవరూ లేకపోవటం చేత ఆ రాత్రికి ఒక సత్రంలో బసచేశాడు. ఆయన గొప్ప పండితుడనీ, రాయలు ఆయనకు వెయ్యి వరహాలు బహుమతి ఇచ్చారని సత్రంలో అందరికీ ఎలాగో తెలిసిపోయింది.

ఆ రాత్రి పండితుడు అందరిలాగే సత్రం చావడిలో తన పక్క వేసుకున్నాడు. ఆయన పక్క పరుచుకోగానే మరొకడు వచ్చి ఆయన సరసనే తన పక్కకూడా పరుచుకున్నాడు. వాడొక మోసగాడు; వెయ్యివరహాలూ కాజెయ్యటానికి అక్కడ చేరాడు.

అర్ధరాత్రి అంతా గాఢనిద్రలో ఉండగా, ఆ మోసగాడు పండితుడి తలకింది చేతినంచీ ఉపాయంగా సంగ్రహించి చూశాడు. అందులో వరహాలు లేవు. పండితుడి పక్క సాధ్యమైనంత వరకు తడివి చూశాడు. వరహాల జాడలేదు.

ఆయన వాటిని ఎక్కడ దాచి ఉంటాడో తెలుసుకోవాలన్న ఆసక్తితో మోసగాడు తెల్లవార్లూ మేలుకుని ఉన్నాడు. తెల్లవారగానే పండితుడు లేచి మోసగాడి దిండు కింది నుంచి వరహాల మూట తీసుకుని వెళ్ళిపోయాడు. —యం. వి. కె. మూర్తి





# ధర్మదేవత

భూలోకంలో ధర్మదేవత నీతిపరులనూ, నిజాయితీపరులనూ ఎలా కాపాడుతున్నదో తెలుసుకోవాలన్న కోరిక పార్వతికి కలిగింది. ఆ కోరిక తీరటానికి శివుడు ఆమెను విజయపుర రాజ్యానికి వెళ్ళమన్నాడు.

ఆ రాజ్యాన్ని అమరసేనుడు అనే రాజు పాలించేవాడు. అతని ఆస్థానంలో వివేకవర్మ అనే ఒక ఉన్నతాధికారి ఉండేవాడు. అతను చాలా గొప్ప నీతిపరుడు.

అందుచేత వివేకవర్మ కింద పనిచేసే వారికి అవినీతిగా ప్రవర్తించటానికి అవకాశం ఉండేదికాదు. అవినీతిపరుల ముఠాకు నాయకుడు సురేంద్రవర్మ. వీరందరూ కలిసి వివేకవర్మ ఉద్యోగం ఊడటానికి ఒక పన్నాగం పన్నారు. వాళ్ళు తాము అక్రమంగా సంపాదించిన సొమ్ము నుంచి వెయ్యి బంగారునాణాలు పోగుచేసి, వాటిని ఒక పాత్రలో పోసి మూసి, ఆ పాత్రను వివేకవర్మ ఇంటి పెరడులో ఒకచోట పూడ్చిపెట్టారు.

తరవాత వాళ్ళు రాజుకు ఒక ఆకాశరామన్న ఉత్తరం రాస్తూ, వివేకవర్మ గొప్ప లంచగొండి అనీ, తన అక్రమ సంపాదనను రహస్యంగా తన పెరట్లో ఈశాన్యమూల పాతిపెట్టాడనీ తెలిపారు.

ఈ ఉత్తరం అందిన వెంటనే రాజు కొందరు భటులను వెంటబెట్టుకుని, వివేకవర్మ ఇంటికి వచ్చాడు. అదిచూసి వివేకవర్మ ఆశ్చర్యపోయాడు. రాజు అతనికి ఆకాశరామన్న ఉత్తరం సంగతి చెప్పి, భటుల చేత పెరటి ఈశాన్యదిక్కున తవ్వించాడు. పాత్ర బయటపడింది, కాని అందులో రాళ్ళుమటుకే ఉన్నాయి.

తనకు వ్యతిరేకు లెవరో ఇలా కుట్ర చేశారని వివేకవర్మ రాజుకు నచ్చచెప్పాడు. ఆ పాత్రలో ఉండిన బంగారం

కొలార్ కృష్ణఅయ్యర్

ఈ విధంగా మాయమయింది. అవినీతి పరులముఠా రాత్రివేళ బంగారాన్ని వివేకవర్మ ఇంటికి తీసుకుపోతూండటం ఒక దొంగ కనిపెట్టి, వారిని వెంబడించాడు. వాళ్ళు ఆ ధనాన్ని ఎక్కడ దాచిపెట్టారో వాడు చూసి, అందులోని బంగారం తీసుకుని, పాత్రలో రాళ్ళు నింపి, తిరిగి దాన్ని భూమిలో పాతిపెట్టి, తన దారిన తాను వెళ్ళిపోయాడు.

ధర్మదేవత వివేకవర్మను ఎలా కాపాడినదీ పార్వతి చూసింది.

తమ పన్నాగం పనికిరాకుండా పోయినందుకు సురేంద్రవర్మా, అతని అనుచరులూ నిరాశచెందటమే గాక, తమ డబ్బు పోయినందుకు కుమిలిపోయారు. వాళ్ళు వివేకవర్మను అంతటితో వదలక, మరొక ప్రయత్నం తలపెట్టారు.

సురేంద్రవర్మ ఒకరాత్రి వివేకవర్మ ఇంటికి తన అనుచరు లిద్దరినీ, వారి వెంట రత్నాభరణాలు ధరించిన స్త్రీనీ పంపాడు. వాళ్లు వివేకవర్మతో, '' అయ్యా, మేం యాత్రికులం. దూరదేశం నుంచి వస్తున్నాం. సత్రంలో బసచేశాం. మా వద్ద బోలెడంత డబ్బూ, రత్నాభరణాలూ ఉన్నాయి. సత్రంలో వీటికి దొంగలభయం ఉండవచ్చుగనక, ఈ రాత్రికి మా డబ్బూ, ఆభరణాలూ మీ ఇంట భద్రంగా ఉంచితే, రేపు తీసుకు పోతాం,'' అన్నారు.

పరోపకారి అయిన వివేకవర్మ వారి డబ్బూ, నగలూ తీసుకుని జాగ్రత్త



పెట్టాడు. వెంటనే రాజుకు మరొక ఆకాశ రామన్న ఉత్తరం వెళ్ళింది. వివేకవర్మ ఒక వ్యక్తి దగ్గిర బోలెడంత డబ్బూ, రత్నాభరణాలూ లంచంగా పుచ్చుకున్నాడు. అతని ఇల్లు సోదాచేస్తే అవి దొరుకుతాయి.

ఆ రాత్రే రాజు భటులతో వివేకవర్మ ఇంటికి వెళ్ళి, ఇల్లంతా సోదా చేశాడు. కాని పెద్ద ఎత్తున డబ్బు గాని, వజ్రాభరణాలు గాని దొరకలేదు.

వివేకవర్మ రెండో ఆకాశరామన్న ఉత్తరం కూడా చూసి, రాజుతో ఇలా అన్నాడు: ''మహాప్రభూ, ఈ ఉత్తరంలో కొంత నిజం ఉన్నది. చీకటిపడ్డాక ఇద్దరు పురుషులూ, ఒక స్త్రీ వచ్చి, తాము యాత్రికులమనీ, సత్రంలో బసచేశామనీ, అక్కడ దొంగలభయం కాబట్టి తమ డబ్బూ, ఆభరణాలూ దాచమనీ నా కిచ్చారు. కాని కొంతసేపటికి ఆ ఇద్దరిలో ఒకడూ, స్త్రీ వచ్చి, తాము వెంటనే ప్రయాణమై పోతున్నామని చెప్పి, డబ్బూ, నగలూ తీసుకుని వెళ్ళిపోయారు.''

వివేకవర్మ ఈ మాట చెప్పుతూండగానే రాజభటులు ఒక పురుషుణ్ణీ, స్త్రీనీ పట్టి తెచ్చి, ''మహాప్రభూ, వీళ్ళిద్దరూ బోలెడంత డబ్బూ, వజ్రాభరణాలూ దాచుకుని, అనుమాన పరిస్థితులలో పారిపోతుంటే పట్టుకుని ఆరాతీశాం. వీళ్లు సురేంద్రవర్మ అనుచరులు. వివేకవర్మను ఎలాగైనా ఉద్యోగం నుంచి తొలగించేలాగా రాజుగారి ఆగ్రహానికి గురి అయేటట్టు చేయాలని ప్రయత్నించినట్టు ఒప్పుకున్నారు. వివేకవర్మ వద్ద డబ్బూ, ఆభరణాలూ దాచబెట్టినాక వీళ్ళకు సురేంద్రవర్మకు ద్రోహం చేసి, వాటిని కాజెయ్యాలని బుద్ధి పుట్టిందట,'' అన్నారు.

రాజు సురేంద్రవర్మనూ, అతని అనుచరులనూ కఠినంగా శిక్షించి, వివేకవర్మను ఇంకా పెద్ద హోదా గల ఉద్యోగంలో నియమించాడు.

ఇదంతా చూసిన పార్వతీదేవి ధర్మదేవతను మెచ్చుకుంటూ కైలాసానికి తిరిగి వెళ్ళిపోయింది.






దుఃఖంలో ఉన్న రాముడికి విభీషణుడు ఏమి చెబుతున్నదీ అర్థంకాలేదు. అందుచేత అతను కొంతసేపటికి తనను తాను నిగ్రహించుకుని, "విభీషణా, ఇప్పుడేమిటో చెప్పావు. నాకు సరిగా తెలియలేదు. మళ్ళీ చెప్పు." అన్నాడు.

దానికి విభీషణుడు ఇలా అన్నాడు:

"నువు నిష్కారణంగా దుఃఖిస్తూ, మాకు కూడా దుఃఖం కలిగిస్తున్నావు. సంతోషిస్తున్నది నీ శత్రువులు మాత్రమే. రాక్షసులను చంపటమూ, సీతను తిరిగి పొందటమూ నీ కోరిక అయిన పక్షంలో యుద్ధప్రయత్నం చెయ్యి. లక్ష్మణుణ్ణి వానరసేనతో సహా నికుంభిలకు పంపి, ఇంద్రజిత్తుతో యుద్ధంచేసి, అతన్ని చంపమను. ఇంద్రజిత్తు హోమం చెయ్యటానికి నికుంభిలకు వెళ్ళాడు. అతను ఆ హోమం పూర్తి చేశాడంటే మనందరికీ చావు తప్పదు. అది బ్రహ్మదేవుడు ఇంద్రజిత్తుకు ఇచ్చిన వరం. అతని నికుంభిలా హోమానికి ఆటంకం కలిగించిన వాడి చేతిలో ఇంద్రజిత్తు చస్తాడు. ఇంద్రజిత్తు చచ్చాడంటే, రావణుడూ, అతని మిత్రులూ చచ్చినవాళ్ళ కిందనే లెక్క."

రాముడు లక్ష్మణుడితో ఇంద్రజిత్తును చంపి రమ్మన్నాడు. అందుకుగాను లక్ష్మణుడు బలమైన వానర, భల్లూక సేనలను వెంట తీసుకుపోయేటట్టూ, నికుంభిలకు దారి చూపటానికి విభీష

## 29. ఇంద్రజిత్తు మరణం



ణుడు లక్ష్మణుడి వెంట వెళ్ళేటట్టూ ఏర్పాటు జరిగింది. లక్ష్మణుడి వెంట హనుమంతుడు కూడా బయలుదేరాడు.

బయలుదేరేటప్పుడు లక్ష్మణుడు బంగారు అలంకరణలు గల ధనుస్సూ, బాణాలూ, కవచమూ ధరించాడు. విభీషణుడు కూడా మంచి విల్లు ధరించాడు. వాళ్ళు నికుంభిలకు వెళ్ళేటప్పుడు, దూరంగా వ్యూహం పన్ని ఉన్న రాక్షస సేన వారికి కనబడింది.

విభీషణుడు లక్ష్మణుడికి ఆ రాక్షస సేనను చూపి, "ఇంద్రజిత్తు హోమం పూర్తి కాకముందే వానరసేనలు రాక్షస సేనలను నాశనం చెయ్యాలి. నువ్వు ఈ సేనను ఛేదించు. అప్పుడు నీకు ఇంద్రజిత్తు కనిపిస్తాడు. అప్పుడు నువ్వు ఇంద్రజిత్తును చంపెయ్యి," అన్నాడు.

వెంటనే వానరులూ, భల్లూకాలూ, లక్ష్మణుడూ రాక్షససేన మీద దారుణమైన యుద్ధం చేశారు.

తన సేనలో చెలరేగిన హాహాకారాలు విని, ఇంద్రజిత్తు తన హోమం పూర్తి కాకుండానే లేచి, తన రథాన్ని ఎక్కి, యుద్ధానికి సిద్ధమైవచ్చాడు.

విభీషణుడూ, లక్ష్మణుడూ కొంత దూరం వెళ్ళాక ఒక మహా వనం కనిపించింది. ఇంద్రజిత్తు హోమం చేసే చోటు అక్కడే ఉన్నది. అక్కడ నల్లగా, భయంకరమైన మహా వృక్షం ఉన్నది. ఇంద్రజిత్తు అక్కడే భూత బలులు ఇచ్చి, యుద్ధానికి వస్తాడు. తరవాత అతను ఎవరికీ కనబడకుండా యుద్ధం చేస్తాడు.

ఈ సంగతి విభీషణుడు చెప్పేసరికి, లక్ష్మణుడు యుద్ధసన్నద్ధుడై ఆ మహా వృక్షం సమీపంలో నిలబడ్డాడు. ఇంతలో యుద్ధానికి సిద్ధమై, రథం మీద ఇంద్రజిత్తు ఆ చెట్టును సమీపించాడు.

"నిన్ను యుద్ధానికి పిలుస్తున్నాను. నాతో యుద్ధం చెయ్యి," అన్నాడు లక్ష్మణుడు ఇంద్రజిత్తుతో.

ఇంద్రజిత్తు లక్ష్మణుడి మాట విని, అతని వెంట విభీషణుడు ఉండటం చూసి, ఆగ్రహంతో ఇలా అన్నాడు:

"విభీషణా, నువు రాక్షసుడివై ఉండి కూడా కులాభిమానం ఎలా వదిలావు? ఇది నీ జన్మస్థలం. నువు సాక్షాత్తూ నా తండ్రికి తమ్ముడివి. నాకు ఎలా ద్రోహం తలపెట్టావు? ధర్మం లేని దుర్మార్గుడివి. నీకు బంధువులనీ, స్నేహమనీ, కులమనీ, రక్తస్పర్శ అనీ లేదు. అయిన వాళ్ళను వదిలిపెట్టి శత్రువుకు దాసుడివి అయావు! బంధువులు నిన్ను చూసి ఏడుస్తారు; మంచివాళ్ళు నిన్ను తిట్టిపోస్తారు. అయినవాళ్ళ మధ్య గొప్పగా ఉండటానికీ, శత్రువుల మధ్య హీనంగా ఉండటానికీ తేడా ఏమిటో నీకు తెలియలేదు. నాకు బంధువువై ఉండి, నా హోమం భగ్నం చేసి, నాకు అపకారం చెయ్యటానికి ఇలా చేశావు. ఇలాటి నీచమైనపని మరొకడు చెయ్యడు."

దానికి విభీషణుడు ఇలా అన్నాడు:

"నా స్వభావం నీకు తెలీదా? నాది సాత్విక స్వభావం. అధర్మాన్ని నేను సహించలేను. లేకపోతే, నా అన్నను నేను వదులుకుంటానా? నీ తండ్రికి అన్ని అపలక్షణాలూ ఉన్నాయి. త్వరలోనే ఈ లంకలోని రాక్షసులు, నీ తండ్రితో సహా నశించనున్నారు. నీకు చావు మూడింది. నన్ను ఏమనాలని ఉన్నదో అన్నీ అను. చచ్చిపోనున్నవాడివి నిన్ను





తిట్టి ఏం లాభం? మాయా సీతను చంపి, రామలక్ష్మణులకు అవమానం చేశావు. నువు జీవించలేవు. లక్ష్మణుడితో యుద్ధం చేసి, చచ్చిపోయి, యమదూతలకు సేవ చెయ్యి.''

ఇంద్రజిత్తు లక్ష్మణుణ్ణి చూసి, ''ఆ రాత్రి యుద్ధంలో నా బాణాలదెబ్బ తెలుసుకుని కూడా నువు మళ్ళీ నాతో యుద్ధానికి వచ్చావంటే నీకు మతిమరుపో, ఆయువు తీరిపోవటమో కావాలి,'' అన్నాడు.

''దొంగలాగా కనబడకుండా యుద్ధం చేసి గొప్ప వీరుణ్ణి అనుకుంటున్నావు! ఇప్పుడు చూపించు నీ అసలు ప్రతాపం,'' అన్నాడు లక్ష్మణుడు.

ఇంద్రజిత్తు చప్పున లక్ష్మణుడి మీద బాణాలు వేసి, అతని శరీరమంతా నెత్తురుమయం చేశాడు. లక్ష్మణుడు కోపించి, ఇంద్రజిత్తు మీద తీవ్రమైన బాణాలు వేశాడు. ఇద్దరూ సమంగా యుద్ధం చేశారు.

కొంతసేవు యుద్ధం సాగాక ఇంద్రజిత్తు ముఖంలో విభీషణుడికి భయం కనిపించింది. అతను లక్ష్మణుడితో, ''ఇంద్రజిత్తు దెబ్బ తిన్నట్టున్నాడు. అతన్ని చంపెయ్యటానికి ఇదేసమయం,'' అన్నాడు.

లక్ష్మణుడు మరింత తీక్ష్ణమైన బాణాలతో ఇంద్రజిత్తును కొట్టాడు. ఇంద్రజిత్తు మూర్ఛపోయాడు.

అయితే ఇంద్రజిత్తు స్పృహవస్తూనే ఎదురుగా లక్ష్మణుణ్ణి చూసి, తన పరాక్రమం మాట జ్ఞాపకం వచ్చి, లక్ష్మణుడి మీదా, అంతకన్న హెచ్చుగా విభీషణుడి మీదా బాణాలు వేశాడు.

ఆ బాణాలు లక్ష్మణుడికి కొంచెమైనా బాధ కలిగించలేదు. ''యుద్ధంలో గెలవగోరినవాడు ఇలాగా బాణాలు వేసేది?'' అంటూ అతను ఇంద్రజిత్తు మీద తీవ్రమైన బాణాలు వేశాడు.

లక్ష్మణుడి బాణాలకు ఇంద్రజిత్తు కవచం ముక్కలు ముక్కలుగా రథంలో



రాలిపడింది. అతని దేహం బాగా గాయ పడింది.

ఇంద్రజిత్తు ఆగ్రహించి, తన బాణా లతో లక్ష్మణుడి కవచాన్ని కూడా పగల గొట్టేశాడు. ఈ విధంగా వారిద్దరూ ఒకరి కొకరు తీసిపోకుండా చాలాసేపు యుద్ధం చేశారు. ఇద్దరూ జయమేకోరి పట్టుదలతో పోరాడారు. అలాటి యుద్ధం ఎవరో ఒకరు చచ్చినదాకా ఆగదు.

ఆ యుద్ధం చూసిన మీదట విభీష ణుడు తాను కూడా తన మంత్రులు నలుగురితోసహా యుద్ధానికి పూనుకోవటం మంచిదని భావించి వానర సైనికులతో ఇలా అన్నాడు:

"వానర వీరులారా, ఇక రావణుడికి ఈ ఇంద్రజిత్తు తప్ప వేరేగతిలేదు. వీణ్ణి ఎందుకు ఉపేక్షిస్తారు? మీరు ఇప్పటికి రాక్షస వీరుల నందరినీ చంపేశారు. ఈ ఒక్క ఇంద్రజిత్తు అనగా ఎంత? వీణ్ణి కూడా చంపేశారంటే రావణుడు దిక్కులేని వాడే! వాణ్ణి నేనే చంపుదును గాని, వాడు నాకు కొడుకు వరస. నేను వాణ్ణి చంపటం తప్పు అవుతుంది. ఇంద్ర జిత్తుకు సహాయంగా ఉన్న సేనను నిర్మూలించండి."

ఈ మాటలు విని వానరులు తోక లాడించి, సింహనాదాలు చేసి, రాక్షససేన మీదికి విజృంభించారు. విభీషణుడూ, అతని మంత్రులూ కూడా రాక్షససేనపై యుద్ధం సాగించారు.

ఈలోపుగా లక్ష్మణుడు ఇంద్రజిత్తు రథ సారథి తల ఒక బాణంతో నరికేశాడు. అప్పుడు ఇంద్రజిత్తు తానే తన రథాన్ని నడుపుకుంటూ యుద్ధం చేశాడు. అది చూడటానికి ఆశ్చర్యకరంగానే ఉన్నది గాని, లక్ష్మణుడు అతన్ని బాధించటానికి అవకాశం మరింతగా ఏర్పడింది. ఆ దెబ్బతో ఇంద్రజిత్తుకు ఉండిన యుద్ధ గర్వం పోయింది. అతని ముఖంలో మార్పు గమనించి వానరులు ఎంతగానో సంతోషించారు.

ప్రమాథీ, శరభుడూ, రభసుడూ, గంధమాదనుడూ అనే నలుగురు వానర వీరులూ, ఇంద్రజిత్తు రథాన్ని లాగే నాలుగు గుర్రాల మీదా ఒక్కసారి పడ్డారు. అవి నెత్తురు గక్కి, చచ్చి పడిపోయాయి.

ఇంద్రజిత్తు రథం నుంచి నేల మీదికి దిగి, లక్ష్మణుడిపై బాణాలు వేస్తూ మీదికి వచ్చాడు. అతని చుట్టూ రాక్షసులు కమ్ముకుని ఉన్నారు.

ఇంద్రజిత్తు వాళ్ళతో, "మీరు యుద్ధం సాగిస్తూ ఉండండి. మీ చాటున నేను నగరంలోకి వెళ్ళి, మరొక రథం ఎక్కి వస్తాను," అన్నాడు.

అతను ఆ ప్రకారమే లంకలోకి వెళ్ళి, మంచి రథం సిద్ధంచేయించి, దానిమీద తిరిగి యుద్ధానికి వచ్చాడు. అతను ఉన్నట్టుండి రథం మీద తిరిగి ప్రత్యక్షం కావటం చూసి, లక్ష్మణుడూ, విభీషణుడూ కూడా ఆశ్చర్యపోయారు.

ఈసారి ఇంద్రజిత్తు తన బాణాలతో వానరసేనకు అమితంగా నష్టం కలిగించాడు. అదిచూసి లక్ష్మణుడు అతని విల్లు విరిచాడు. తరవాత అతని సారథి తల నరికేశాడు. అయినా ఇంద్రజిత్తు యుద్ధం సాగించటమేగాక, విభీషణుణ్ణి కూడా తన బాణాలతో గాయపరిచాడు. విభీషణుడు



మండిపడి, తన గదతో ఇంద్రజిత్తు రథాశ్వాలను చంపాడు.

తరవాత ఇంద్రజిత్తూ, లక్ష్మణుడూ దివ్యాస్త్రాలు ఒకరి మీద ఒకరు ప్రయోగించుకున్నారు. చిట్టచివరకు లక్ష్మణుడు ప్రయోగించిన ఐంద్రాస్త్రంతో ఇంద్రజిత్తు తల తెగి కిందపడింది.

విభీషణుడూ, వానరులూ సింహనాదాలు చేశారు. వానరులు విజయగర్వంతో తమని వధ చెయ్యసాగేసరికి రాక్షసులు రెట్టింపు శోకంతో లంకలోకి పారిపోయారు.

ఇంద్రజిత్తు చావగానే వానరులు అమితంగా సంతోషించి, లక్ష్మణుణ్ణి కొని

యాడారు. లక్ష్మణుడు రాముడి వద్దకు పోయి నమస్కరించి నిలబడ్డాడు. రాముడు అతన్ని కౌగలించుకుని, ''ఇంద్రజిత్తు చావటం రావణుడి కుడిభుజం తెగి పోవటమే. ఇక రావణుణ్ణి అతి సులువుగా చంపగలను.'' అని, లక్ష్మణుడి గాయాలకు చికిత్స చేయమని సుషేణుణ్ణి నియోగించాడు.

ఇంద్రజిత్తు వెంట వచ్చి, యుద్ధభూమిలో అక్కడక్కడా యుద్ధం చేస్తున్న రాక్షసవీరులు, ఇంద్రజిత్తు పోయినట్టు విని దుఃఖిస్తూ, రావణుడి వద్దకు వెళ్ళి, విభీషణుడి సహాయంతో లక్ష్మణుడు ఇంద్రజిత్తును చంపాడని చెప్పారు. ఆ వార్త వింటూనే రావణుడు మూర్ఛపోయాడు.

తిరిగి స్పృహవచ్చినాక రావణుడు ఇంద్రజిత్తు కోసం చాలా శోకించాడు. అతని పుత్రశోకం క్రమంగా క్రోధంగా మారింది. అతనికి సీతనే చంపెయ్యాలన్న అభిప్రాయం కలిగింది. అతను తన ఎదట ఉన్న రాక్షసులతో, ''నా కొడుకు ఇంద్రజిత్తు మాయసీతను వానరుల ఎదట చంపి చూపించాడు. నేను నిజమైన సీతనే చంపుతాను. రాముడి మీది నుంచి మనసు మరలని సీతను చంపేస్తాను.'' అని చెప్పి, కత్తి దూసి, రౌద్రంగా అశోకవనంలో ఉండే సీతాదేవి దగ్గిరికి బయలుదేరాడు.

ఈ సంగతి తెలిసి మండోదరీ, రావణుడి మంత్రులూ అతనికి అడ్డు తగిలారు.

''ఇప్పటికైనా సీతను రాముడికి అప్పగించి, సర్వనాశనం జరగకుండా చూడు,'' అని మండోదరి రావణుడికి హితవు చెప్పింది.

''ఈ కోపాన్ని రాముడి మీద చూపించు. సీతను చంపి సాధించే దేమిటి ?'' అన్నారు రావణుడి మంత్రులు.

తన కర్తవ్యం రాముణ్ణి చంపటమే కాని, సీతను చంపటం కాదని తెలుసుకుని, రావణుడు ఉగ్రమైన లంకా యాగం మొదలు పెట్టాడు.






భారత స్వాతంత్ర్యం కోసం అసంఖ్యాకులైన భారతీయులు తమ ప్రాణాలను బలిపెట్టారు. అలాంటి మహావీరులలో చేర్చదగినవాడు బాఘా జతీన్. ఇతను 1879లో బెంగాలులోని ఒక గ్రామంలో పుట్టాడు.



'బాఘా' అంటే పులి. అతనికి ఆ బిరుదు ఎలా వచ్చిందంటే, ఒక ఉదయం తన గ్రామం సమీపంలో ఒక భయంకరమైన పులి మీదపడితే, దాన్ని అతను ఒక చిన్న చాకుతో చంపాడు. పులి అతన్ని తీవ్రంగా పీకింది. అయినా అతను, అతని డాక్టరు చెప్పినట్టు, "కేవలం ఆత్మబలంతో" బతికి బయటపడ్డాడు.



జతీన్ పని పులిని చంపటంతో తీరిపోలేదు. అతను సింహంతో—తన మాతృదేశాన్ని ఆక్రమించిన బ్రిటిషువారితో—పోరవలసి ఉన్నది. స్వామి వివేకానందుడూ, శ్రీ అరవిందుడూ చెప్పిన జాతీయభావాలతో ఉత్తేజితుడై, అతను విదేశీపాలకులపై తిరుగుబాటు చేయటానికి గాను యువకులను రహస్యంగా సంఘటితపరిచాడు.



అతను ఆ యువకులకు కర్రసామూ వ్యాయామమూ, తుపాకులు కాల్చడమూ నేర్పాడు. వాళ్ళు తమ జీవితాలను భారత స్వాతంత్ర్యానికి అంకితం చేశారు. వారి రహస్యచర్యలు తెలిసి, ప్రభుత్వం వారి నాయకుడైన జతీన్‌ను అరెస్టు చేసింది.



జతీన్‌ను బెదిరించారు. చిత్రహింసలకు గురిచేశారు. కాని అతను ఏ రహస్యమూ బయటపెట్టలేదు. భయాన పనిజరగక, నయాన అతన్ని దారికి తేవాలని అతనికి ఆస్తీ, డబ్బూ, సుఖాలూ ఆశచూపారు. "నోరుముయ్యండి!" అని జతీన్ బల్లపై గట్టిగా గుద్దాడు. బల్ల విరిగింది.



ఏ నేరమూ ఆరోపించలేక జతీన్‌ను విడిచిపెట్టారు. ఈలోపుగా అతను తన మనుషులను తన తిరుగుబాటుకు గాను ఆయుధసామగ్రి కోసం యూరప్‌కు పంపాడు. జర్మనీ సహాయం చేస్తానన్నది. జతీన్, తన ముగ్గురు అనుచరులతో కప్తిపదా అనే మారుమూల గ్రామానికి వెళ్ళి, బాలసోర్ సమీపంలో ఉండిన పురాతన రేవు వద్ద, ఆయుధాలు తెచ్చే జర్మన్ నౌక కోసం ఎదురుచూశాడు.

భారత స్వాతంత్ర్య సమరం నిమిత్తం అయుధాలు తెచ్చే జర్మన్ నౌకను రెండు బ్రిటిష నౌకలు తరిమాయి. పట్టుబడేలోపల జర్మను నౌక అయుధా లన్నిటినీ సముద్రంలో పారేసింది. జతీన్ ఈ సంగతి విని, "అంటే మనం విదేశీ సహాయం మీద ఆధారపడరాదన్న మాట," అన్నాడు.





జతీన్ తరువాత ఏం చెయ్యాలో నిర్ణ యించేలోపుగా కలకత్తా గూఢచారులు అతని రహస్యస్థావరం కనిపెట్టారు. పోలీసులు అతన్నీ, అతని అనుచరులనూ పట్టుకోవటానికి పూనుకున్న రోజు వాన కురుస్తున్నది. అయినా జతీన్, అతని వాళ్ళూ సాహసోపేతంగా తప్పించు కున్నారు.



విఫలులైన పోలీసులు, భయంకరులైన బందిపోటు దొంగలు తప్పించుకు పోతున్నారని పుకారు వేశారు. వారిని పట్టుకున్నవారికి బహుమానం! అయితే యువకులు నలుగురూ దాగుతూ, పాకుతూ, మనుములను తప్పించు కుంటూ బుధబలంగ్ నది చేరుకున్నారు.



అక్కడి గ్రామస్థులు వారిని చూసి బందిపోట్లు అనుకుని కేకలుపెట్టారు. అయినా ఆ యువకులు తొణకకుండా, తుపాకులూ, మందుగుండుసామానూ ఎత్తి పట్టుకుని నది దాటారు.



పోలీసులూ, సైనికులూ అక్కడికి వచ్చేసరికి ఒక మట్టిదిబ్బ మీద, పుట్టల చాటున పోరుకు సిద్ధపడ్డారు. పోరాటం అనేక గంటలపాటు సాగింది. ఆ నలుగురు వీరుల తుపాకులక్కు అనేక డజన్ల పోలీసులు ఎర అయారు. వాళ్ళు తీవ్రంగా రక్తం ఓడుతూ కూడా అస్త్ర సన్యాసం చెయ్యలేదు; ఆఖరు తూటా అయిపోయినదాకా పోరాడారు.



చివరకు జతీన్ పట్టుబడ్డాడు. అయితే ఆ రాత్రే అతను మరణించాడు. అతను తనను పట్టుకున్నవారితో, "నా అనుచరులను శిక్షించవద్దు. జరిగినదానికంతటికీ నేనే బాధ్యుణ్ణి!" అన్నాడు. "భారతీయులందరిలోకీ మహావీరుణ్ణి చూశాను!" అని పోలీస్ కమిషనర్ సర్ చార్ల్స్ టిగార్ట్ అని జతీన్‌ను ప్రశంసించాడు.

# కథా శీర్షిక పోటీ

## ఈ కథకు మంచి పేరు పెట్టి రు 25 లు గెలవండి!

## ?

పదిమంది వర్తకులు చాలా డబ్బు గడించి, అరణ్యమార్గంలో వస్తూండగా సాయుధులైన ముగ్గురు గజదొంగలు వారిని ఎదిరించి, వారి డబ్బుతోపాటు వారి ఒంటిమీది దుస్తులు కూడా కాజేసి, వారికి పుట్టగోచీలు పెట్టించి, "మీరు నృత్యం చేసి మమ్మల్ని ఆనందింపజేయండి!" అని ఆజ్ఞాపించి, ఆయుధాలు పక్కన బెట్టి, నేల మీద కూర్చున్నారు.

నిరాయుధులైన వర్తకులు విధిగా దొంగలు చెప్పినట్టు చెయ్యవలసి వచ్చింది. అయితే వాళ్ళు పదిమంది ఉన్నారు. దొంగలేమో ముగ్గురే. వాళ్ళు తమ ఆయుధాలను కింద కూడా పెట్టారు. ఇది గమనించిన ఒక గడుసు వర్తకుడు ఇలా పాట పాడుతూ నాట్యం ప్రారంభించాడు:

"మూడు మూళ్ళు తొమ్మిది!
మిగిలేది పది!"

ఇదేదో వర్తకుల పాట అనుకున్నారు దొంగలు. కాని మిగతా వర్తకులు దాని అర్థం గ్రహించి, మూడు జట్లుగా చీలి, సమయం చూసి, దొంగల మీద ముగ్గురేసి చొప్పున పడి పట్టుకున్నారు. పాట పాడినవాడు గుడ్డలతో ముగ్గురు దొంగల చేతులూ, కాళ్ళూ కట్టేసి, ఈడ్చుకుపోయి రాజుగారికి అప్పగించాడు.

★ ★ ★

పై కథకు మంచి పేరు ఆలోచించి ఒక కార్డు మీద మాత్రమే, మీ చిరునామాతోపాటు రాసి, "కథా శీర్షిక పోటీ", చందమామ, 2 & 3 ఆర్కాట్ రోడ్డు, వడపళని, మద్రాసు 600 026 అన్న చిరునామాకు పంపండి. కవర్లు వగైరా పరిశీలించబడవు.

కార్డులు మాకు ఫిబ్రవరి 20 లోగా చేరాలి. అందులో ఫొటో వ్యాఖ్యలు చేర్చరాదు. ఫలితాలు, '77 ఏప్రిల్ చందమామలో ప్రకటించబడతవి.

---

డిసెంబర్ నెల పోటీ ఫలితం: నిధి చాల సుఖమా?
గెలుపొందిన వారి పేరు: జి. మల్లీశ్వరి, జి. 43, ఆర్ బి ఐ స్టాఫ్ క్వార్టర్స్, మద్రాసు-10

## ఫోటో వ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 25 లు

ఈ ఫోటోల వ్యాఖ్యలు 1977 ఏప్రిల్ సంచికలో ప్రకటింపబడును.



Sharma Studio



B. Sreesailam

★ పై ఫోటోలకు సరిఐన వ్యాఖ్యలు ఒక్కమాటలోగానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.)

★ ఫిబ్రవరి నెల 20-వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరువాత చేరే వ్యాఖ్యలు ఎంతమాత్రమూ పరిశీలింపబడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా ఉన్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 25/-లు బహుమానం.

★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన వ్రాసి, (వ్యాఖ్యలకు సంబంధించని ఇతర విషయాలేవీ చేర్చరాదు.) ఈ అడ్రసుకు పంపాలి :-చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు-26.

---

## డిసెంబర్ నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో : కుట్టితే అందం

రెండవ ఫోటో : గ్రుచ్చితే అలంకారం

పంపినవారు : జి. సరస్వతి, మల్లేశ్వరరోడ్డు, అనంతపురం.

బహుమతి మొత్తం రు. 25/-ఈ నెలాఖరులోగా పంపబడుతుంది.

Printed by B. V. REDDI at Prasad Process Private Ltd., and Published by B. VISWANATHA REDDI for CHANDAMAMA CHILDREN'S TRUST FUND (Prop. of Chandamama Publications) 2 & 3, Arcot Road, Madras 600 026 : Controlling Editor : NAGI REDDI

## చందాదారులకు గమనిక

'చందమామ' కాపీలు పంపుటకు మీ చిరునామాలో ఏదైనా మార్పుంటే 5-వ తేది లోగానే, మీ చందా నంబరు ఉదహరిస్తూ మాకు తెలపాలి, ఆలస్యమైతే మళ్ళీ నెల వరకు మీ క్రొత్త అడ్రసును అమలు పెట్టడానికి వీలుండదు.

డాల్టన్ ఏజన్సీస్
'చందమామ బిల్డింగ్స్'
మదరాసు - 26

# ఛూయింగ్ గమ్ సీమలో NP క్రాకీస్ స్వైర విహారం







ఎన్ పి క్రాకీస్ చూయింగ్ గమ్—భారతదేశంలో రుచికి
నాణ్యతకి ఎక్కువ మంది ఇష్టపడే చూయింగ్ గమ్.
పిన్నలను, పెద్దలనూ ముగ్ధుల్ని చేస్తుంది. క్రాకీస్
చూయింగ్ గమ్. అందుకనే, మీకు
ఆనందాన్నిచ్చే క్రాకీస్ చూయింగ్
గమ్‌ని ఎల్లప్పుడూ మీకు సన్నిహితంగా
వుంచుకోండి.

**ఐ.ఎస్.ఐ. మార్కు వున్న ఏకైక
చూయింగ్ గమ్.**




**ది నేషనల్ ప్రో డక్ట్సు**
బెంగుళూరు 560 006.

**NP రుచిచూసి పొందండి మంచి ఆనందం**

Dattaram NP4

# నవ్వుల రుచుల రాజ్యం



# బ్రిటానియా
# బ్రిటాహై కౌంట్ బిస్కట్లు
# కేవలం రూ. 1/-కి బోలెడన్ని

బ్రిటానియా బిస్కట్లు అత్యుత్తమమైనవి

లింటాస్-BBC. 24-140 TL

